JAGATI Rs. 3-00 Sept. 1988

33rd Year of Publication




# స్వాతంత్ర్య దినోత్సవ సంచిక – 1988

మహాభారతం భీష్మపర్వంలో వున్న భగవద్గీత, సంస్కృత సాహిత్యం లోని కవితా పారిజాతం. ఫిలాసఫీని అంతటి సౌందర్య దీప్తితో చూపిన కావ్యం మరింకే భాషలోనూ లేదంటాను. 'గీత'ను 'శ్రుతి' (అపౌరుషేయం) అని ఎవరూ అనలేదు; సంప్రదాయంలో యిమిడే 'స్మృతి' అన్నారు.... సంపన్నులు యజ్ఞ యాగాదులతో దేవుళ్లని తృప్తి పరచగా, సంస్కారయుతులు విద్యాబుద్ధులతో జ్ఞానమార్గం తెలుసుకోగా, సామాన్యులకు భక్తితత్వాన్ని బోధపరిచి 'నీలో ఉన్న ఈశ్వరాంశను' తెలుసుకోమన్నది గీత.... మానవాత్మలోని సంఘర్షణే కురుక్షేత్రం - అర్జునుడు అందుకు సంకేతం; కృష్ణుడు పరబ్రహ్మకు ప్రతి రూపం. కవితా భావనకు, తత్వజ్ఞానానికి మధ్య నిలబడి, ఉపనిషద్వాణితో వెలుగులు చిమ్ముతుంది గీత.

—రాధాకృష్ణన్

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు – 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : రాధాకృష్ణన్

## మనని మనుషులుగా చేసిన

# పూ॥ బాపూజీ

అహింసా ధర్మానికి కట్టుబడివున్న సత్యాగ్రహి, మార్గాన్నీ లక్ష్యాన్నీ ఏక దృష్టిలో చూడగలడు. ఆ రెండూ అతనికి వేరు వేరుగా కనిపించవు. దౌర్జన్యమెప్పుడూ భీరుత్వం నుంచి జనిస్తుంది. దౌర్జన్యవాదులు భీరువులు, తన ఆదర్శాన్ని త్రికరణ శుద్ధిగా నమ్ముతూ, అందుకొరకై ఆత్మార్పణకు కూడా వెనకాడని ధీరపురుషుడే సత్యాగ్రహి.

ప్రఖ్యాత చరిత్ర కారుడు ఆర్నాల్డ్ టాన్‌బీ మానవజాతి యిప్పటి వరకూ ముప్ఫయి నాగరికతలు చూసిందనీ, అందులో యిరవై ఒకటి సంపూర్ణంగా పెరిగినవనీ, అయిదు మధ్యలో స్తంభించిపోయాయనీ, మిగతా నాలుగూ పువ్వుగా వున్నప్పుడే తుంపి వేయబడ్డాయనీ అంటాడు. ఈ యిరవై ఒక్క పరిపూర్ణ నాగరికతలలోనూ ఏడు మాత్రమే సంఘపరంగా జీవించి వున్నాయి. హిందూ నాగరికత, ఇస్లామ్ నాగరికత - ఇస్లామ్ అనగా ఇరానిక్, అరబిక్ నాగరికతల మేళవింపు - దూరప్రాచ్య నాగరికత, పురాతన క్రీస్తు నాగరికత, రష్యన్ శాఖా నాగరికత, పశ్చిమ నాగరికత.

దేశపు ఎల్లలకూ, రాజుల రాజ్య విస్తరణ కాంక్షకూ అతీతమై, తనలో గల సాంస్కృతికపు విలువలని కొన్ని శతాబ్దుల పాటు, పదిలంగా కాపాడుకో గలిగినదే నాగరికత అను పేరుతో పిలువబడుతోంది. తమ రాజవంశాల కీర్తి ప్రతాపాలు చెప్పే దేశ చరిత్రల కంటె నాగరికతల చరిత్ర నిష్పాక్షిక మైనది. ఆర్నాల్డ్ పేర్కొన్న సజీవ నాగరికతలలో హిందూ నాగరికత ఒకటి.

సంవత్సరంలోని ఏభైరెండు వారాలలో, అయిదు వారాలకు సరిపడ ఆహార పదార్థాలు మాత్రమే స్వదేశంలో పండించుకోగల ఆంగ్ల ప్రభువులు, మిగతా నలభైఏడు వారాల తిండికీ, తమ వలసలమీద, ఇరుగు పొరుగు దేశాల మీద ఆధారపడివున్న వారవడంచేత, వారు ఆక్రమించిన ప్రదేశాలలోని ప్రజల జీవన పద్ధతిని తమకి లాభసాటిగా వుండేటట్లు మార్చి వేయబూనారు. కొంతవరకూ మార్చ గలిగారు. అన్యనాగరికత, స్వజాతీయ నాగరికతతో సంఘర్షణకు దిగినప్పుడు కలిగే ఫలితాలే భారత దేశంలో పద్దెనిమిదవ శతాబ్దం నుం



వచ్చాయి. భారతీయ నాగరికతలో గల ప్రాచీన శక్తులు విజాతీయ భావాలను ఎదుర్కొన్నాయి. తత్ఫలితమే 1857 నాటి ప్రథమ విప్లవం. రాజసంతో కదన రంగాన వీరవిహారం సల్పిన శక్తులు, కాల ప్రభావం వల్ల వోడి పోయిన కారణంగా, సాంఘిక వాతావరణంలో నూతన చైతన్యం జనించింది. సంఘంలోని జడత్వాన్నీ మూఢత్వాన్నీ పొగొట్టేందుకు ప్రయత్నం జరిగింది. నూటికి తొంభయి వంతులు నిరక్షరాస్యులైన ఈ దేశంలో సంఘసంస్కా

రం, విద్యా వంతులూ విబుధ వరులూ అయిన కొద్ది మంది ని మాత్ర మే స్పృశించ గలిగింది. ప్రజానీకం ఎప్పటి మూఢత్వంలోనూ అవిద్యలోనూ మగ్గి పోతున్నారు. ఏ కారణాల వల్ల తమ సుస్థిర సాంప్రదాయిక జీవనంలో విపత్తులు సంభవిస్తున్నాయో తెలుసుకో లేని మందభాగ్యులు వారు. సింధు ప్రాంతాన ఉప్పురాళ్లలో గల ఉప్పు ప్రపంచ మంతటికీ 250 సంవత్సరాల పాటు సరిపడుతుంది; ఒక్క భారత దేశానికే అయితే 1250 సంవత్సరాల పాటు సరి పడుతుంది. పంజాబులోని లవణ శిలలు, ప్రపంచ ప్రజలందరికీ వెయ్యి సంవత్సరాల దాకా కావల్సిన ఉప్పుని అందజేయగలవు. కాని ఖాళీ ఓడలని ఉప్పు బస్తాలతో నింపి పంపుతూ, ఉప్పు పన్ను ప్రవేశ బెట్టారు ఆంగ్ల పాలకులు. అదేవిధంగా సీమ బట్టలు చెల్లుబడి అయేందుకు చేనేత పనివారిని నిరాధారులుగా చేశారు. ఆంగ్లభాష తెలిసిన అత్యల్ప సంఖ్యాకులు తప్ప - ప్రజాసామాన్యం చీకటిలో కొట్టు మిట్టాడుతూండేది.

అటువంటి సమయాన ప్రాగ్జ్యోతి వలెఉదయించాడు అమరబాపూజీ. అహింసా, సత్యమూ, విశ్వప్రేమకు వ్యాకరణ సూత్రాలుగా, ఈ దేశంలోని ప్రతి ఒక్కని కన్నీటి బొట్టూ తుడిచి వేయాలనే ధీర సంకల్పంతో రంగ స్థలంపై కురికాడు గాంధీమహాత్ముడు. దక్షిణ ఆఫ్రికాలోని ఆయన ప్రయత్నాలు, కనివిని ఎరుగని ఈ అహింసా సమరానికి ప్రాతిపదిక మాత్రమే. నోబెల్ బహుమాన గ్రహీత, ప్రఖ్యాత రాజనీతి కోవిదుడు, ఫీల్డ్ మార్షల్ స్మట్స్ గాంధీగారితో ఒకసారి అంటాడు : "మీ మనుషుల మీద నాకు సదభిప్రాయం లేదు. వారికి సహాయం చేయాలని ఎంత మాత్రం లేదు. కాని, మా కష్టదినాలలో మీరు మాకు సాయం చేశారు. అందుకు ప్రత్యుపకారం చేయకుండా వుండటం మెలా? మీ మీద చేయి వేయడానికి మనసొప్పడంలేదు. ఇంగ్లీషుసమ్మెదారు లకివలె మీ వాళ్ళు కూడా దౌర్జన్యానికి పూనుకుంటే నా పని తెలికయేది. శత్రువుని కూడా మీరు హింసించ రే - అదే మీతో వచ్చిన యిబ్బంది. గౌరవ మర్యాదలను ఏ మాత్రం అతిక్రమించ కుండా, ఆత్మత్యాగంతో మీరు విజయపథాన్ని కాంక్షిస్తారు. మీ ఆత్మత్యాగం ముందు నేను అసహాయుణ్ణి అవుతున్నాను" (అన్నాడు ఫీల్డ్ మార్షల్ స్మట్స్).

అంతవరకూ మితవాదుల చేతుల్లో వున్న భారత రాజకీయాలు గాంధీజీ ప్రవేశంతో విప్లవధోరణిలో పడ్డాయి. విదేశవస్తు బహిష్కరణతో ప్రారంభ మయింది. జాతీయ సమరం. యువ జనులకు కర్తవ్యం బోధించి, సభానంతరం సీమబట్టలు కాల్చేస్తూ వుండేవారు. ఈ భోగిమంటలు ఆరని జ్వాలలై బ్రిటిష్ అధికారులని ఆరాట పరిచాయి. స్మట్స్ చెప్పినట్టే బ్రిటిష్ వారికి కూడా ఈ అహింసా సమర సేనానిని ఏం చెయాలో తోచేదికాదు. నాయకులను జైళ్ళకి పంపి, ముఖ్య

నాయకుణ్ణి మాత్రం వెలుపల వుంచారు. అందుకు కారణం ఒక్కటే కనబడు తుంది. ఉద్యమ ప్రారంభాన గాంధీగారిని జైలులో పెడితే, ప్రజలలో తీవ్ర అసంతృప్తి చేలరేగి అరాజకం ఏర్పడవచ్చుననే భీతి. ఎంతైనా గాంధీజీ పోరాటం నియమ బద్ధమూ శాంతి యుతమూను.

1922 ఫిబ్రవరిలో చౌరీ చౌరా సంఘటన జరిగింది. అక్కడి గ్రామీ ణులు యిరవై ఒక్కమంది పోలీసు జవాన్లనీ, ఒక సబిన్‌స్పెక్టర్‌నీ పోలీసు స్టేషన్‌లో పెట్టి తాళంవేసి, యింటికి నిప్పంటించారు. ఆ మంటలలో ఆ యిరవై యిద్దరూ దారుణ మరణం పొందారు. దౌర్జన్య ప్రకోపం కనబడ గానే గాంధీజీ వెంటనే తన ఉద్య మాన్ని ఆపివేశాడు. అధికారులకు ఈ అహింసాపద్ధతి అర్థంగాక గాంధీ గారిని అరెస్ట్ చేసి, ఆరేళ్ళ జైలు శిక్ష విధించారు.

గాంధీజీ ఉద్యమాన్ని ఆ ప్రకారం ఆపి వుండకూడదని అన్నారు-సత్యా గ్రహ సూత్ర ధర్మం తెలియని కొందరు ఆవేశపరులు. సత్యాగ్రహమనగా ఒక వైపున ప్రేమ, మరొక వైపున సత్యము - బొమ్మబొరుసూ వలె గల నాణెము. అది ఏ దేశంలో అయినా, ఏ సమాజంలో అయినా చెల్లుతుంది. సహాయనిరాకరణకూ, సత్యాగ్రహానికీ తేడా వుంది. Passive Resistance లో దౌర్జన్యం పూర్తిగా నిర్మూలితం కాదు. నీరసులైనవారూ, తగినంత ఆత్మశక్తి లేనివారూ, సహాయనిరాకర ణోద్యమంలో దౌర్జన్య ప్రలోభానికి లోనుగావచ్చు. సత్యాగ్రహంలో ఆ పొరబాటు ఎప్పటికీ జరగదు, అహింసా ధర్మానికి కట్టుబడివున్న సత్యాగ్రహి, మార్గాన్నీ లక్ష్యాన్నీ ఏక దృష్టితో చూడగలడు. ఆ రెండూ అతనికి వేరు వేరుగా కనిపించవు. దౌర్జన్యమెప్పుడూ భీరత్వంనుంచి జని స్తుంది. దౌర్జన్యవాదులు భీరువులు. తన ఆదర్శాన్ని త్రికరణశుద్ధిగా నమ్ముతూ, అందుకొరకై ఆత్మార్ప ణకు కూడా వెనకాడని ధీరపురుషుడే సత్యాగ్రహి.

గాంధీ శకంలోని చైతన్య స్రవంతి లో విదేశవస్తుబహిష్కరణ తర్వాత ఉప్పు సత్యాగ్రహం. ఉప్పుకోసం యింత అట్టహాసం జరిగిందే - ఈనాడు మనందరం యిళ్ళలోఉప్పు తయారు చేసుకుంటున్నామా, అని మీరు అడగవచ్చు. అది కానే కాదు. ఉప్పు ఆ సమర నీతికి ఒక చిహ్నం. శిరసుపై లాటీ దెబ్బలు రివ్వు రివ్వున తగులుతున్నా, పిడికిట్లో పట్టుకున్న ఉప్పుని వొదలకుండా ప్రాణాలు అర్పించిన సత్యాగ్రహ వీరుల నైతిక శక్తే, బ్రిటిష్ రాజ్యాధినేతలనుగడ గడలాడించింది. పరఫిరంగులూ మారణాయుధాలూ తెలుసుతప్ప, చిటికెడు ఉప్పుకోసం ప్రాణాలు వొదలడం వారి నాగరికతకు అర్థంకాని విషయం. ఈ ధీరవరులముందు తమ సైనికపంక్తులు నిరుపయోగమని పించాయి వారికి. ప్రజాసామ్య ధర్మానికి కట్టుబడ్డ బ్రిటిష్ వారు గనక

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని ఆ ప్రకారం సాగనిచ్చారు, అదే హిట్లరు వంటి పాలకుడైతే గాంధీగారి పద్ధతులు అనుసరణీయములయేవా అని కొందరు యిప్పటికీ అమాయికంగా ప్రశ్నిస్తూంటారు. గాంధీజీకి ఆంగ్లేయుల పట్లగాని, ఆంగ్లేయ వ్యవస్థల పట్లగాని ఎటువంటి ద్వేషమూలేదు సరిగదా అమితంగా ప్రేమించేవాడు. ఈ ప్రేమానుబంధమే శత్రువుని అశక్తునిగా చేసేది.

చాలా సంవత్సరాలక్రితం అబ్రహిమ్ లింకన్ స్వదేశీ ఉద్యమంగురించి ఇలా అన్నాడు: 'ఈ టారిఫ్‌లూ వాటి గురించి నాకంతగా తెలియదు. నాకు తెలిసిందల్లా ఒక్కటే. బయట దేశంనుంచి వచ్చిన వస్తువులు మనం కొనుక్కుంటే, వస్తువులు మనకు వుంటాయి; డబ్బు పరాయిదేశానికి పోతుంది. మనదేశంలో తయారైన వస్తువులు కొనుక్కుంటే డబ్బూ వస్తువులుకూడా మనదేశంలోనే వుండిపోతాయి' - (అన్నాడు అబ్రహిమ్ లింకన్). విదేశీవస్తు బహిష్కరణోద్యమం యించుమించు ఈ వరవడినే జరిగింది. ఇక, ఉప్పుసత్యాగ్రహం, ప్రజల దైనందిన జీవితావసర వస్తువైన ఉప్పు మీద, అన్యాయంగా విధింపబడ్డ పన్ను రద్దుచేయమనే ఆందోళనతో ప్రారంభమయింది. గాంధీజీ జరిపినది శాంతియుత శాసనోల్లంఘనం. ఈ శాసనోల్లంఘనం ఏనాడూ దౌర్జన్యకాండకు దారి తీయకుండగా విప్లవ శక్తులని తన గుప్పెట్లో పెట్టుకు శాంతి సమరం సాగించేవాడు బాపూజీ. తాము జరిపే శాసనధిక్కారం పాలకులకు తమ అసమ్మతిని తెలిపేదిగా వుండాలే తప్ప, వారిని యిబ్బంది పెట్టేటట్లూ వాడిని కించపరిచేట్లు వుండరాదనేవాడు. ఈ ధోరణి ఆయన సన్నిహిత వర్గంలోని వారికి కూడా అర్థమయేది కాదు అప్పుడప్పుడు.

గాంధీ - యిర్విన్ ఒడంబడిక సందర్భంలో గాంధీజీ, యిర్విన్ ప్రభువుని 1930 నాటి సత్యాగ్రహంలో పోలీసువారు జరిపిన దారుణ హింసల విషయమై దరియాప్తు జరగాలని పట్టుదలతో కోరగా 'వారి తప్పులు నేను అంగీకరిస్తున్నాను. ఇంకా దరియాప్తు జరపమని మీరు అంతగా పట్టుబట్టడం, గవర్నరు జనరల్‌ని కించపరచడమే అవుతుంది. నన్ను న్యూనతపరచడం మీకు న్యాయమా?' అని ఇర్విన్ ప్రభువు సవినయంగా అనేటప్పటికి, తన పట్టుదల మానుకొని, కాంగ్రెసు కార్యవర్గానికి ఈ సున్నిత పరిస్థితిని నివేదించి, ఒడంబడికను ఆమోదించాడు గాంధీజీ. తన ఆత్మగౌరవంతో బాటు ఎదుటి వారి ఆత్మగౌరవాన్ని కాపాడగల ధీశాలి ఆయనొక్కడే!

మొదటి ప్రపంచ యుద్ధ భేరీ మోగగానే జార్జి బెర్నార్డ్‌షా 'సైనికులారా, మీరు నాసలహా పాటించి, ఆ తుపాకులు అక్కడ పారేసి, మీ పొలాలకూ, ఫాక్టరీలకూ వెళ్ళి పొండి' అని చెప్పాడు. ఒక బ్రిటిష్ పార్లమెంట్ సభ్యుడు ఆగ్రహావేశుడై

'యితన్నింకా ఎందుకు జైల్లో పారెయ్యి లేదూ ?' అని అడిగాడు. అందుకు బెర్నార్డ్‌షా అన్నాడు: 'స్వామీ, నేను ఆ సలహా బ్రిటిష్ సైనికులని వుద్దేశించి చెప్పానని కాబోలు మీరు భయపడుతున్నారు. అది జర్మన్ సైనికుల గురించి అయితే మీకు అభ్యంతరం వుండదులెండి. కాని, నేను చెప్పినది అన్ని దేశాల సైనికులని వుద్దేశిస్తూను' అన్నాడు. అదే విధంగా రెండవ ప్రపంచ యుద్ధ శంఖారవం వినబడగానే గాంధీజీ, తనకి బెర్లిన్‌భగ్నమైనా, లండన్ ధ్వంసమైనా రెండూ ఒకటేననీ, ఈ రెండు దేశాలూ దౌర్జన్యానికి దిగి మానవాళిని అంధకారంలో ముంచ రాదనీ శాంతి మార్గాన పరిష్కృతం కాని సమస్యలు వుండవనీ క్షుభిత హృదయంతో కడుదీనంగా నివేదించాడు. కాని యుద్ధ క్రతువుకు సిద్ధంగా వున్న ప్రపంచం, జ్ఞానుల వాక్కు ఎందుకు వింటుంది? భారతదేశాన్ని ఈ యుద్ధంలోకి దింపే అధికారం బ్రిటన్‌కి లేదన్నాడు మహాత్ముడు. తత్ఫలితంగానే 'వ్యక్తి సత్యాగ్రహం' ప్రారంభ మయింది. న్యాయవిచారణ సమయంలో సాక్ష్యసేకరణకు ఎటువంటి యిబ్బందీ లేకుండా 'వ్యక్తి సత్యాగ్రహి' తాను యుద్ధ ప్రయత్నానికి విముఖుణ్ణనే విషయం రెండు వాక్యాలలో చీటీ మీద వ్రాసుకొచ్చి, తమ సత్యాగ్రహం జరిపేబోటు ముందుగానే అధికారులకు తెలియబరిచి, వారు వచ్చాక చీటీలోగల రెండు వాక్యాలూ చదివి, అరెస్టయేవాడు. వ్యక్తి సత్యాగ్రహం నాజూకుగా సొగసుగా జరిగిపోయింది. ఆ పైన క్విట్ ఇండియా తీర్మానం, దేశ విభజనకు ఆమోదం, దేశస్వాతంత్ర్యం.

బ్రాపూజీ కర్మయోగి, ఆయన ప్రబోధించిన అహింసలో శాస్త్రమూ కళా రెండూ వున్నాయి. శ్రవణేంద్రియాలపై శబ్దజాలం ఏ ప్రకారంగా పడుతు







న్నదో తెలుసుకోవడం శాస్త్రం; ఆ వింటున్న పాటని ఆనందించగలగడం కళ. కళాభిరుచిలేనప్పుడు శ్రావ్యమైన పాట అర్ధరహితమగు శబ్దాలవలెనూ, రమణీయ చిత్రలేఖనం, రంగులు పులిమినట్లూ, కమనీయ కావ్యం వ్యాకరణ దోషభూయిష్టమైనట్లూ తోస్తుంది. భగవద్విశ్వాసమే ప్రగతికి ప్రాణ వాయువు అని పల్కిన బాపూజీ తన అహింసాధర్మంలో కళకీ శాస్త్రానికీ ఐక్యత సమకూర్చాడు.

సహాయ నిరాకరణను రాజకీయ పుటాయుధంగా వెనక అమెరికనులూ, ఆ తర్వాత కొరియనులు వాడి వున్నారు. 'పాసివ్ రెసిస్టెన్స్' పద్ధతి కొత్తదీ కాదు, బాపూజీ స్వయంగా కనిపెట్టినదీ కాదు. కాని బాపూజీ దీనిలోగల దౌర్బల్య బిహ్నాన్ని పూర్తిగా తుడిచేసి, దీప్తివంతమగు సత్యాగ్రహ యుధంగా దీనిని రూపొందించాడు. బుద్ధుడు, మహావీరుడు, లాటొస్, జీసస్, పాల్ అఫ్ టారన్, పీటర్, వాల్డో, వైకిఫ్, హాస్, సినాన్స్, జార్జిఫాక్స్ జాన్ వూల్‌మాన్, విలియమ్ పెన్స్, థోరో టాల్‌స్టాయ్- వీరందరూ మానవాళికి, అహింసాధర్మాన్ని బోధించిన వారే. కాని, బోధించవలసినదిలేదు, ఆచరించి చూపించవలసినదని, తత్కార్యాచరణకై తన జీవితసర్వస్వంధారపోసిన కర్మయోగి బాపూజీ. అందుకే ఆయన తన ఆత్మకధను 'సత్యాన్వేషణలో, నా ప్రయత్నాలు' (My Experiments with Truth)అని అన్నాడు.

గాంధీజీ ఆరాధించిన సచ్చిదానంద మూర్తిలో, భగవత్ స్వరూపము 'సత్'; అదే విజ్ఞానమయకోశము 'చిత్': దానినుంచే పరమార్థ జ్ఞానమనదగు 'ఆనందము' - ఈ మూడూ ఒకే మూర్తిలోనివి. స్థిత ప్రజ్ఞుడైన గాంధీజీ, ఒక ప్రవక్త, ఒక మహర్షి. ఈ పూర్ణ పురుషుని తేజః ప్రభావం భారతీయ సంస్కృతికి నవజీవనమిచ్చింది: మనని మనుషులుగా చేశాడు ఈ అహింసా వ్రతధారి.

— యస్నార్ చందూర్

'ఆకాశవాణి' ప్రసంగం

1964 ఫిబ్రవరి - 'జ గ తి'



చేరదీసిన వానిని మింగి వేస్తుంది అసూయ.

సగం సగం చేసేపని, కాలీ కాలనీ రొట్టె వంటిది.

ఒక సద్భావన సుమపరిమళంలా అల్లుకు పోతుంది.

సహనం నుంచి లభించే ఫలాలు మధురంగా ఉంటాయి.

విత్తనాల వంటివి మన చేతలు - వాటిని బట్టే ఫలితాలు.

తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వానికి మిగిలేదేమీ వుండదు.

నియమావళి లేనిదే ఏ కార్యమూ నిర్వహించలేము.

విశ్వాసము హేతువుని అధిగమిస్తుందేగాని దానిని వ్యతిరేకించలేదు

— గాంధీజీ సూక్తులు

పన్నెండుకోణాల నుంచి 1965లో

# పండిట్ నెహ్రూ

ప్రజాస్వామ్యానికి ప్రాణంపోసి, ప్రపంచశాంతే భారతీయుల ప్రగాఢ వాంఛ అని సర్వమానవాళికి పలుమార్లు తెలిపిన ఈ పుణ్యజీవి, ప్రణాళికాబద్ధంగా పయనించడమే ప్రగతి పథమని భావించారు. నెహ్రూ గారు అవలంబించిన విధానాలు ఒక వ్యక్తి యిష్టానిష్టాలకు చెందినవి కావు. వాటి వెనక ఒక జాతి జీవస్పందన వున్నదనే విషయం చాలా మంది విమర్శకులు విస్మరిస్తూంటారు. బహుముఖ ప్రజ్ఞానిధి అయిన నెహ్రూజీని విభిన్న కోణాలనుంచివీక్షించగల అవకాశమే ఈ వ్యాసపరంపర.

## నవ భారత నిర్మాత

నెహ్రూ రాజకీయ చరిత్ర వ్రాసిన ఒక రచయిత 1956లో, అంటే ఆయన దివంగతులు కావడానికి ఎనిమిదేండ్లకు ముందు ఆయన్ని ఒక ప్రశ్న అడిగారు. దేశంలో సోషలిస్టు ప్రజాస్వామ్య ప్రభుత్వం, మతాతీత ప్రభుత్వ వ్యవస్థ, వ్యవహారాలలో అలీన విధానం - ఈ ముఖ్య విధానాలు ఆయన తర్వాత కూడా కొనసాగేందుకు ఎలాటి ఏర్పాట్లు చేశారని అడిగారు. అందుకు నెహ్రూ ఇలా అన్నారు :

'ఇందుకు సమాధానం చెప్పడం కష్టమే. కాని, నేను ప్రోత్సహించి ప్రచారం చేసిన ఈ విధానాలు కేవలం ఒక వ్యక్తి సృష్టించినవికావని మాత్రం ముందుగా చెప్పాలి. వీటిని గాఢంగా విశ్వసించేవారు చాలా మందే ఉన్నారు. అంతకన్న ఇంకో విశేషం కూడా ఉంది. ఈ విధానాలకు దేశంలో అశేష ప్రజాబాహుళ్యం మద్దతు ఉంది. క్రమ క్రమముగా అమలుపరిస్తే ప్రగతి పథంలో కొంత దూరం సాగినట్లు అవుతుంది. అప్పుడింక వెనుకంజ వెయ్యడానికి వీలు పడదు. ప్రజలకు సంబంధించినంత వరకు నా బాధ్యత ఏమిటంటే ఆయా విషయాలు వారికి అర్థమయ్యేటట్లు సులభమైన భాషలో వివరించడం. ఇక మిగతా సంగతులు : చెయ్యగలిగినంత చెయ్యడమే మనవంతు. భవిష్యత్తును గురించి అట్టే బెంగపెట్టుకో కూడదు.... నిద్రాణమై ఉన్న భారత జాతిని మేల్కొల్పి ప్రజలలో ఒక నవ

చైతన్యం కలిగించారు గాంధీ మహాత్ముడు. అటువంటి ఖ్యాతి ఆయనకు దక్కితే, ప్రజలను ప్రగతి పథంలో ముందుకు నడిపించడమే కాకుండా, స్వయముగా ప్రగతి మార్గాన్ని గుర్తించే వికాసాన్ని వారికి కలిగించినఖ్యాతి నెహ్రూకు దక్కింది.

ఇది రెండు విధాలా ప్రయోజన కారి అయ్యింది. ఒక వంక సాంఘిక, ఆర్థిక, అంతర్జాతీయ రంగాలలో నెహ్రూ విధానాలు ముమ్ముందు కూడా అనుసరింపబడేలా చెయ్యడం జరిగింది. మరొకవంక ప్రజలే ఇందుకు పూచీ పడేలా చెయ్యడం జరిగింది. ఫలితంగా ఈ విధానాలు అమలు పరచడంలో ప్రజలే భాగస్వాములయ్యారు.

నెహ్రూ ప్రజలలో నవతా జ్యోతి వెలుగందుకొనేలా చేశారు. వారికి కార్యదీక్ష అలవరిచారు. వారికి ఉన్న తాశయాలు, ఆశలు కల్పించారు. దృఢ సంకల్పంతో అచంచల విశ్వాసంతో ఆ లక్ష్యాలూ ఆదర్శాలూ సాధించడానికి మార్గం కూడా ఆయన సూచించారు. తత్త్వవేత్త, మార్గదర్శకుడు, ఆదర్శ విప్లవవాది కావడమే కాకుండా నెహ్రూ భారత దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థకు రూపుదిద్దిన మహనీయుడు. భారతదేశానికి ఆయన విడిచిపెట్టిన వారసత్వంలో పరిపూర్ణ ప్రజాస్వామ్య వికాసం మహత్తరమైనదని కొందరి భావన. సోషలిస్ట్ సిద్ధాంతం పట్ల, ఆయనకు ప్రగాఢమైన విశ్వాసం ఉన్నప్పటికీ, వ్యక్తి ప్రాధాన్యం కూడా ఆయన సమంగానే గుర్తించారు.

## ప్రజాస్వామికం

సమతకు స్థానంలేని సాంఘిక వ్యవస్థ ప్రకృతి విరుద్ధమైనది. అది కాల క్రమాన పతనం చెందక తప్పదు. భారత దేశ సాంఘిక చరిత్రను క్షుణ్ణంగా అకళింపు చేసుకున్న పండిట్ నెహ్రూ వెనకెప్పుడో అన్నారు; 'సుస్థిరమైన సాంఘిక వ్యవస్థను రూపొందించడంలో భారత దేశం ఎంతటి ఘన విజయాన్ని సాధించిందో, సంఘ శ్రేయస్సుకు ప్రాణప్రదమైన 'సమత్వాన్ని' అంతఘనంగా నిర్లక్ష్యం చేసింది. అందుకే పతనావస్థ పొందింది.

సమత్వం, సాంఘిక న్యాయం. సాంఘిక భద్రతలతో కూడిన సాంఘిక వ్యవస్థను సృష్టించాలనే దృష్టి ఆయనది. సమాజ పరిణామసిద్ధాంతాన్ని రూపొందించారు. ఆ వ్యవస్థ వ్యక్తిగత లాభాపేక్ష, దురాశ మొదలైన వ్యామోహాలకు అతీతమైనదీ, రాజకీయ అధికారం, ఆర్థిక సంపదలను న్యాయబద్ధంగా పంపిణీచేసే అవకాశాన్ని కల్పించేదిగా ఉండాలని ఆయన లక్ష్యం. ప్రజాస్వామిక పద్ధతితో, శాంతియుత మార్గాల ద్వారా, ప్రజలందరికీ సమానావకాశాలుగల, వర్గరహితమైన సమాజాన్ని సృష్టించాలన్నదే ఆయన సిద్ధాంత పరమలక్ష్యం.

ఈ వర్గరహిత సమాజ స్థాపనకు సోపానాలుగా రెండు ముఖ్య సిద్ధాంతాలను ఆయన ప్రవచించారు. ఒకటి ప్రజాస్వామ్యం, రెండవది సోషలిజం. ఈ రెండింటి మేలు కలయికే 'ప్రజాస్వామిక సామ్యవాదం' లేక 'సామ్యవాద ప్రజాస్వామ్యం' లేక 'ఆర్థిక ప్రజాస్వామ్యం'-హింసా విధానంతో కూడిన నియంతృత్వం ద్వారాగాక ప్రజాస్వామ్యం వర్ధిల్లడం ద్వారానే మన దేశంలో సోషలిజమ్‌ను స్థాపించాలి. ప్రజాస్వామిక వ్యవస్థలో వుండే లాంఛన ప్రాయమైన సమానత. సోషలిస్టు వ్యవస్థలో సిసలైన సమాజంగా మార్పు చెందినప్పుడే, 'ప్రజాస్వామిక సోషలిజం' సార్థక మౌతుంది.

మన దేశంలోని ఆర్థిక, సాంఘిక పరిస్థితుల దృష్ట్యా, భారత సాంఘిక వ్యవస్థ చైతన్య వంతమైనదిగా ఉజ్వలమైనదిగా వుండాలని నెహ్రూ అన్నారు. అప్పుడు సత్వరాభ్యుదయం సాధ్యమై, ప్రజా స్వామిక సోషలిజం, న్యాయ చట్టాలు, ప్రయోజనకరమైన ప్రణాళికల ద్వారా వర్గరహిత సమాజాన్ని నిర్మించవచ్చు.

బీదవారు మరింత బీదవారుగానూ భాగ్యవంతులు మరింత భాగ్యవంతులుగానూ చేసే శక్తులను అరికట్టి, బీదలకు దారిద్ర్య దుఃఖాన్ని తొలగించి, ఆర్థిక సంపద కొందరికి పరిమితం కాకుండా, గుత్తాధికారానికి అవకాశం లేని విధంగా ఆర్థిక వ్యవస్థను సత్వరంగా అభివృద్ధి పరచడమే నెహ్రూ ప్రవచించిన ప్రణాళికా సిద్ధాంతం. ఆర్థిక సంపద కొందరి చేతుల్లోనే వుంటే, ప్రజాస్వామ్యములో సమన్విత అధికారానికి భంగం వాటిల్లి, సాంఘిక వ్యవస్థ బహుప్రయాసలకుగురై, ఆర్థిక అవకాశాలు క్షీణించక తప్పదని పండిట్ నెహ్రూ అన్నారు.

నెహ్రూ గ్రంథాలలోనూ, ప్రసంగాలలోనూ 'శ్రేయోరాజ్యాన్ని' గురించిన ప్రస్తావనలు విస్తారంగా కనపడతాయి. నెహ్రూ కలలుగన్న శ్రేయోరాజ్య సిద్ధాంతాలకూ, పెట్టుబడి దారీ వ్యవస్థలకు లోబడిన శ్రేయోరాజ్య సిద్ధాంతాలకూ, విపరీతమైన తేడా వుంది. 'దమన నీతి తాండవించే రాజ్యం' కంటే శ్రేయోరాజ్యం అన్ని విధాలా శ్రేయస్కరమైనది. అయితే పెట్టుబడి దారీ వ్యవస్థ ఏర్పర్చే 'శ్రేయోర్యాజం సోషలిస్టు వ్యవస్థ నెలకొల్పే 'శ్రేయోరాజ్యం' ఒకటే నంటే, ఆర్థిక సూత్రాల రీత్యా అంతకంటె పొరబాటు మరొకటి లేదు. మానవతా వాదాన్ని ఆచరణలో పెట్టడమే సామ్యవాదం అని నెహ్రూ సిద్ధాంతం. మానవతపరిఢవిల్లిననాడు మానవునిలోని సృజనాత్మక శక్తులు, భవిష్యత్తులో ఎట్టి ప్రమాదము వుండదన్న ధీమాతో, సృజనాత్మక కార్య రూపాలకు వినియోగపడగలవు.

—రఘునాథ రెడ్డి
పార్లమెంటు సభ్యులు



## ప్రజాస్వామ్యవాది

నవభారత నిర్మాణంలో నెహ్రూ నిర్వహించిన పాత్ర అపూర్వమైనది.

సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి ఆయన చేసిన కృషి అత్యంత ప్రశంసనీయ మైనది. భారతీయ సాంఘిక వ్యవస్థను సోషలిస్టు పద్ధతిలో పునర్నిర్మిస్తే తప్ప దేశంలో ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతి సాధించడం శక్యం కాదని విశ్వసించడం మూలంగానే ఆయనకు ఇటువంటి నూతన దృక్పథం ఏర్పడింది.

నెహ్రూ, గాంధీ మహాత్మునితో అత్యంత సన్నిహితమైన సాహచర్యంవల్ల ప్రభావితులయ్యారు. సాంఘిక పరిణామ సాధనలో వర్గ పోరాటం, వైషమ్యాల కంటె ప్రేమ, సామరస్యం, అహింస అత్యంత ఉత్తమ సాధనలని ఋజువు కావడంవల్ల కూడా ఆయన కొంత ప్రభావితులయ్యారు. స్వతంత్ర భారత దేశంలో సామ్యవాద పద్ధతి ఒక నూతన జీవన విధానముగా రూపొందడం వాంఛనీయమని ఆయన ఆశించారు. ఆయన దృష్టిలో సామ్యవాదం కేవలం ప్రజలందరికీ సమానమైన అవకాశాలు కల్పించడానికీ, ఆదాయము, సంపద విషయంలో అసమానతలను సాధ్యమైన మేరకు తొలగించడానికి, ఆర్థిక సంపద యావత్తూ కొద్దిమంది చేతుల్లోకి పోకుండా నివారించేందుకు మాత్రమే ఉపయుక్తమయ్యేది కాదు. సోషలిజమ్ విషయంలో ఆయన ఆశయాలు అంతకంటె ఉన్నతమైనవి. ప్రణాళికా బద్ధంగా ఆర్థికాభివృద్ధి సాధించవలసి ఉన్నదనీ, దేశంలో ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించడానికి, ఆర్థికాభివృద్ధి కుంటుపడకుండా నివారించేందుకూ ఇది ఒక్కటే మార్గమనీ అన్నారు. వివిధ రంగాలలో ఉత్పత్తి శక్తి పెంపొందింప చెయ్యడానికి ఆదాయము పెట్టుబడులు బాగా పెంచవలసి ఉన్నదని ఆయన గుర్తించారు. ఇందుకు సోషలిస్టు పద్ధతిలో సాంఘిక వ్యవస్థ నిర్మించేందుకు ప్రభుత్వం పూనుకోక తప్పదనీ, వివిధ రంగాలలో క్రమాభివృద్ధి సాధించాలనీ ఆయన అభిప్రాయపడ్డారు. ఆయన ప్రణాళికారచన, ఆర్థికాభివృద్ధి సోషలిస్టు పద్ధతిలో సాంఘిక వ్యవస్థ నిర్మాణం - ఈ మూడింటికీ సమాన ప్రాధాన్యం కల్పించారు. ఇవి ఒకదానితో ఒకటి ముడిపడి వున్నాయి. ఆర్థికాభివృద్ధి లేనిదే సోషలిజమ్ ఉండదు. ప్రణాళికాబద్ధం కాకపోతే ఆర్థికాభివృద్ధి జరగదు. సోషలిజమ్ లేకుంటే ప్రణాళికా రచనే ఉండదు. అందువల్లనే మన ప్రణాళికలను ఈ మూడు అంశాలకు సరియైన ప్రాధాన్యం ఇచ్చి రచించడం జరిగింది. నెహ్రూ సిద్ధాంతాల ప్రభావం వీటిపై స్పష్టంగా కన్పిస్తుంది.

—డా॥ వి కె ఆర్ వి రావు
ప్రముఖ ఆర్థికవేత్త



## ఆర్థిక విధానం

భారతదేశం గత 17 సం॥లలో అనుసరించిన ఆర్థిక విధానాలను గురించి విమర్శలు వినవస్తున్నాయి. ప్లానింగ్



*'The woods are lovely, dark and deep,*
*But I have promises to keep,*
*And miles to go before I sleep*
*And miles to go before I sleep'*

*—Robert Frost*



విధానంలోని లోపాలు, దేశ ఆర్థిక సంస్థకు సంబంధించిన నెహ్రూ విధానాలు ప్రస్తుత ఇక్కట్లకు మూల కారణాలని కూడ అంటున్నారు. ఈ నాడు ఆర్థిక సంక్షోభముతో, బాధ పడుతున్న సంగతి నిజమే. ప్రస్తుత ఆర్థిక ఇబ్బందులు లోగడ విధానాల ఫలితమా, లేక కొన్ని పరిస్థితుల ఫలితంగా, ప్రస్తుత ఆర్థిక విధానం మినహాగా మార్గాంతరం లేకపోయిందా అన్న విషయాన్ని ప్రతి భారత పౌరుడూ నిశితంగా పరిశీలించి ఆకళింపు చేసుకోవాలి.

లోగడనుంచి ఆర్థిక విధానాలను విమర్శించటమంటే పండిట్ నెహ్రూ భావుకతనూ, దూర దృష్టినీ విమర్శించడ మన్నమాట. పండిట్‌జీ అమలు జరిపిన విధానాలలోని సహేతుకతను నిరూపించడము ఒక పవిత్ర ధర్మంగా భావిస్తున్నాను. పండిట్ నెహ్రూ ఒక్క ప్రధానమంత్రే కాదు; ఆయన మహానాయకుడు. భారత జాతీయత ఆయనలో మూర్తీభవించి వున్నది. ప్రజలదారిద్ర్యాన్ని నిరక్షరాస్యతనూ తొలగించడానికి తోడ్పడాలంటే అభివృద్ధి కృషి ప్రణాళికా బద్ధంగా కొనసాగించి, సోషలిస్టు సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి కృషి చేయాలన్నదే ఆయన లక్ష్యం.

ఉత్పత్తులు పెంచి, ఆరోగ్యము, పారిశుద్ధ్యాలను మెరుగుపరిచి, ప్రతి ఒక్కరికి కనీస విద్యా సౌకర్యాలు కల్పించి, ప్రజలజీవన ప్రమాణాలను పెంపొందించడమే మన పంచవర్ష ప్రణాళికల ప్రధాన లక్ష్యం. మన సమాజానికి సాంఘిక న్యాయం సమకూర్చాలంటే, ఆర్థిక అసమానతలనూ, గుత్తసంపదలనూ, తొలగించే నిర్దిష్టమైన సాహసోపేతమైన విధానం అవసరం. ఆర్థికపురోభివృద్ధికృషిలో ప్రభుత్వ రంగము ప్రముఖ పాత్రను నిర్వహించడము అవసరమని గుర్తించినందున, ప్రభుత్వ రంగాల ఫలితంగా పరిశ్రమలన్నీ జాతీయం చేయాలనిగాని ప్రయివేటు సంస్థలకు స్థానంలేకుండా చేయాలనిగాని ప్రభుత్వం ఉద్దేశించడం లేదని తొలి పంచవర్ష ప్రణాళికలోనే స్పష్టం చేయబడింది. ఈ విధానాన్ని పురస్కరించుకొనే, కొన్ని పరిశ్రమలను ప్రభుత్వం జాతీయం చేసింది. అణుశక్తి ఆయుధాలు. మందుగుండు సామగ్రి, ఇనుము, ఉక్కుభారీ యంత్రాలు యంత్రపు పనిముట్లు, ఇరిగేషన్ను విద్యుచ్ఛక్తి రంగాలతో బాగా ముందంజ తర్వాత పంచవర్షప్రణాళికలలో ప్రాతిపదిక భారీ పరిశ్రమల అభివృద్ధికి హెచ్చు ప్రాధాన్యం యిచ్చినందుకు కొందరు విమర్శిస్తున్నారు. దూరదృష్టితో ఆలోచిస్తే, ప్రాధాన్యం యివ్వడం తప్పనిసరి అని అర్థమౌతున్నది. పరిశ్రమల సర్వదా పురోభివృద్ధి కృషి సత్వరంగా జరగాలని గుర్తించినందున, ప్రాథమిక పరిశ్రమలనూ, యంత్రాల పరిశ్రమలనూ అభివృద్ధి చేయడము అత్యవసరం.

ఇనుము, ఉక్కు ఇనుము కలియని లోహాలు. బొగ్గు, సిమెంటు, భారీ రసాయనికాలు మొదలైన పరిశ్రమలను

చెప్పుకోదగినంతగా అభివృద్ధి చేయడం అవసరమైనది. వీటితోపాటు వాడకందార్ల పరిశ్రమలు గ్రామ పరిశ్రమలు కూడా అభివృద్ధి చేయబడుతున్నాయి.

ఆర్థికంగా నేడున్న సమస్యలకూ. చిక్కులకూ వాడకం సరుకుల ధరలు అపరిమితంగా పెరిగిపోతూ ఉండడానికీ, నెహ్రూ రూపొందించిన విధానాలే కారణమన్న విమర్శ మాత్రం, నాకు మరీ విడ్డూరంగా కన్పిస్తుంది అలాటి విమర్శలు చేసే వారికి, పంచవర్ష ప్రణాళికలు మూడిటిలోనూ ధనికులను గురించి పొందుపరిచిన విధానాలు, సరిగా బోధపడలేదనే చెప్పవలసి ఉంటుంది. ధరలకు సంబంధించిన విధానానికి ప్రయోజనాలు రెండు. ఒకటి : ప్రణాళికలలో వుద్దేశించిన లక్ష్యాలకు అనుగుణంగా పెట్టుబడులు లభ్యమయేందుకు తగినవిధముగా, సరుకుల ధరలు ఉండేట్టు చూడటం.ఇక, రెండు: ప్రజలకు మితిమీరిన యిక్కట్లు కలిగించేటంత హెచ్చు స్థాయికి ధరలు పెరగకుండా అరికట్టడం. వీటిలో మొదటిది ఎంత ముఖ్యమో. రెండవదీ అంత ముఖ్యమే. ఈ భావాన్ని మూడవ ప్రణాళికలో స్పష్టముగా ఉదాహరించారు కూడాను.

మన ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ ప్రధానమైనది కనక, పంటల దిగుబడులను బట్టి సరుకుల ధరలు మారుతూ వుంటాయి. మొదటి ప్రణాళికా కాలంలో ధరలు



విపరీతంగా పడిపోవడము, రెండవ ప్రణాళికా కాలంలోనూ, మూడవ ప్రణాళికా కాలంలోనూ ధరలు పెరిగే ధోరణి వ్యక్తమవటము కూడా పంటలలో మార్పులను బట్టి జరిగినవే.

1950 లగాయతు 1964 మేనెలలో ఆ మహానాయకుడు అస్తమించే వరకూ, ధర వరల సూచి, 40 పాయింట్లు పెరిగింది. అంటే సంవత్సరానికి మూడు పాయింట్ల చొప్పున మాత్రమే ధరలు పెరిగాయన్నమాట.

రకరకాల కం[ ]్ళను తెచ్చిపెట్టి శ్రీ నెహ్రూ, దేశంలో పరిశ్రమల వ్యాప్తిని ఆటంకపరిచారన్న విమర్శ ఒకటి ఉన్నది. అయితే దీనివల్ల వ్యక్తమయ్యేది ఒక్కటే. ఆ విమర్శించేవారు కంట్రోళ్ళువిధింపుకు దారి తీసిన పరిస్థితులనూ, కంట్రోళ్ళద్వారా సాధించదలచిన ఫలితాలనూ, సరిగా భోదపరచుకో లేకపోయినారు అనేది, అన్యాయానికీ, అక్రమానికి వెరవని వ్యక్తులు చాలామంది దేశంలో ఏర్పడిన కారణాన, పరిస్థితిని అవకాశంగా తీసుకొని బాగుపడేందుకు ఈ కంట్రోళ్ళు అడ్డువచ్చాయను కొనువారే, కంట్రోళ్ళు ప్రణాళికా బద్ధంగా శ్రేయోభివృద్ధి సాధనకు పూనుకున్నప్పుడు, పెరిగే రాబడులకీ, ఆ సొమ్ము ఖర్చుచేసేందు కనువైన సరుకులు లభ్యమవడానికీ మధ్య ఎప్పుడూ, కొంత అంతరం ఉంటుందన్న సంగతి గుర్తుంచుకోవాలి. అంటే అవసరాన్ని బట్టి కంట్రోళ్ళకూ, సరుకు కేటాయింపులకూ మనం సిద్ధపడవలసి వస్తుందన్నమాట. అయితే ఈ రెంటినీ చక్కగా సంఘటితపరచినప్పుడే పని సరిగా జరుగుతుంది. చాలినంతగా లభ్యముకాని మన సాధన సంపత్తి వీలైనంత హెచ్చుగా ఫలప్రదముగా ఉపయోగ పడేందుకు కంట్రోళ్ళు అవసరమవుతాయ్. కేవలము అదేదో ఒక విధానంగా చెప్పుకునేందుకు, కంట్రోళ్ళు ఉండాలని శ్రీ నెహ్రూ ఎన్నడూ అనలేదు.

దేశ ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వం ప్రముఖపాత్ర వహించ గలిగినప్పుడే జన బాహుళ్యము అన్యాయాలకు గురి కావడము తప్పిపోతుంది. ప్రణాళికా బద్ధమయిన ఆర్థిక వ్యవస్థను మనము నమ్ముకోవలసి ఉంటుంది. హెచ్చుగా అసాధారణ పరిస్థితుల మూలముగా ఆర్థిక వ్యవస్థ కొన్ని ఒత్తిడులకు గురి అయినంత మాత్రాన మన జాతీయ విధానాలు లోపభూయిష్ఠమయినవని అర్థము కాదు.

—ఎల్లెన్ మిశ్రా
కేంద్ర ఆర్థిక ఉపమంత్రి



## విదేశాంగ విధానం

ఒక పుష్కరం వెనుకటి స్మృతులవి. ప్రకృతి రమణీయంగా వుండే జూన్‌నెల. సాయంసమయం. జవహర్‌లాల్ నెహ్రూ గౌరవార్థం క్రెమ్లిన్‌లో విందు జరుగుతోంది. భారత, సోవియట్ దేశాలమైత్రి కలకాలం వర్థిల్లాలని సోవియట్ ప్రధాని అన్నారు: "మా రష్యన్లలో స్నేహం అంటూ ఏర్పడితే ఆమరణాంతరం స్నేహి

తులుగానే వుండాలి. విరోధం ఏర్ప డినా అంతే. ఉభయ దేశాల మధ్యా నెలకొన్న స్నేహానుబంధాలపట్ల హర్షం వ్యక్తబరుస్తూ, 'మాకు అసలు శత్రువు అనే వారేలేరు' అన్నారు జవహర్‌లాల్.

ఆనాటి నెహ్రూ మాటలు యీనాడు ఎంత వింతగా ధ్వనిస్తాయి! అక్యాయ్ చిన్, కచ్‌రాణ్ సంఘటనలూ, మెక్ మోహన్ శ్రేణిపై సైనిక సమీకరణ వీటిని ఇప్పుడు గమనిస్తే, భారత దేశానికి శత్రువులు లేరని ఎవరూ అన లేరు. నెహ్రూ అలీనవిధానం ఫలిత మిదేనా అనిపిస్తుంది.

నిజానికి, అలీన విధానము నెహ్రూ విశిష్టతవల్లనే రూపొందినది. మన జాతీయ జీవనంలో ప్రతీ అంశంపైనా నెహ్రూ వ్యక్తిత్వపు ఛాయలు పడ్డాయి. కాని, విదేశాంగవిధానంపై ఆయన ప్రభావం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆయన అధికారాన్ని చేబట్టినప్పుడు భారతదేశానికి సొంత విదేశాంగ విధానమంటూ లేదు. ఆ మాటకొస్తే, అనేక శతాబ్దాలుగా, భారత దేశానికి సొంత విదేశాంగ విధానమంటూ లేనే లేదు. బ్రిటిషు పాలనలో, భారతదేశపు అంతర్జాతీయ సంబంధాలు వైట్‌హాలు (బ్రిటిష్ ప్రభుత్వ కార్యాలయం) లోనే నిర్ణయించబడేవి. ఆఫ్ఘనిస్తాన్, నేపాలు, టిబెట్ సరిహద్దు దేశాలతో బ్రిటిష్ పాలకుల వ్యవహారాలు భారత ప్రభుత్వ విదేశ, రాజకీయ శాఖ ద్వారా జరిగేవి. కాని, దలైలా మాకుగానీ, ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వానికి గానీ, నేపాలుకుగానీ లేదా చివరకు, కలాల్‌ఖాన్‌కుగానీ భారత ప్రభుత్వం వ్రాసే లేఖలన్నిటికీ లండన్ లోని ఇండియా కార్యాలయం ఆమోదముద్ర వుండవలసిందే, బ్రిటిష్ పాలన చివరి రోజుల్లో, ఆంతరంగిక వ్యవహారాలలో భారతదేశానికి కొంత వరకూ స్వయం నిర్ణయాధికారం వుండేది. కాని, అంతర్జాతీయర ంగంలో భారత దేశానికి స్వతంత్రవి ానమే లేదు.

విదేశాంగ కార్యాలయము సర్వసాధారణంగా పూర్వ సంప్రదాయాలనుబట్టి వ్యవహారాలను నిర్వహించే కార్యాలయం. కాని, స్వతంత్ర భారతావనికి పూర్వసంప్రదాయాలంటూ లేవు. అందువల్ల, స్వీయ విదేశాంగ విధానాన్ని కొత్తగా రూపొందించుకోవలసి వచ్చింది. ఒక విధంగా యిది మంచిదే పాత ్వేషాలూ, వైషమ్యాలకు తావు ేకుండా భారతదేశం స్వచ్ఛమైన మనస్సుతో అంతర్జాతీయరంగంలో అడుగుపెట్టింది. నిజానికి అప్పటికి భారతదేశానికి శత్రువులే లేరు.

ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది అప్పటి ప్రపంచ పరిస్థితి ఎలా వుంది? అమెరికా, రష్యాలు రెండూ బలవత్తరమైన రాజ్యాలయినాయి. తమ జీవిత విధానమే సరియైన జీవిత విధానమని వాటి దృఢవిశ్వాసం. ప్రచారం ద్వారానేమి, విద్రోహచర్యల ద్వారానేమి, లేదా యుద్ధం ద్వారా

నేమి, ప్రపంచ దేశాలపై తమతమ ప్రాబల్యాన్ని పెంపొందించుకోవాలనీ ప్రత్యర్థి కూటమి అటకట్టించాలని కృతనిశ్చయంతో వుండేవి. ఒకటి ఉత్తర - అట్లాంటిక్ సైనికకూటమి, అగ్నేయాసియా సైనికకూటమి, మధ్య దేశాల సైనికకూటములను ఏర్పరచు కుంటే, రెండో దివార్సా సైనిక కూటమి ఏర్పరచుకుంది.

అప్పుడు భారతదేశం సైనికంగా బలహీనంగావుంది. ఆర్థికముగా వెనుకబడివుంది. అట్టిపరిస్థితిలో వున్న భారతదేశం ఏదో ఒక రాజ్యకూటమిని అంటి పెట్టుకుని వుంటే, ఆ రాజ్య కూటమి చేతిలో భారతదేశం కీలు బొమ్మ అవుతుందని నెహ్రూ ఒకసారి అన్నారు. అమెరికా వేగుల విమానం (యు-2) పాకిస్తానులో పెషావరు నుంచే కదా సోవియట్ రష్యాకు వెళ్లి నది. దానితోనే, పారిస్‌లో జరుగ వలసిన అధినాయక సమావేశం భగ్న మయింది. ప్రపంచములో శాంతి కర్షకుడుగా ఖ్యాతి గడించాలని ఆశలు పెట్టుకొన్న అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్ ఆశలను అదే ఛిన్నా భిన్నం చేసింది.

భారతదేశం ఏ రాజ్యకూటమి లోనూ చేరకుండా వున్నందుకు జాతీయాభిమానమూ, ఆత్మగౌరవమే కాదు కారణం. 1946 సెప్టెంబరులో తాత్కాలిక జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసిన తరువాత జరిగిన మొట్టమొదటి పత్రికా విలేఖరుల గోష్ఠిలో నెహ్రూ యిలా ప్రకటించారు :

"పూర్వం ప్రపంచయుద్ధాలకు దారి తీసిన రాజకీయాలు, రాజ్య వర్గాల కక్షలకు మేము వీలైనంత వరకూ దూరంగా వుండదలచాం. ఇటువంటి రాజకీయాలు ముందుముందు మరింత విధ్వంసకరమైన యుద్ధాలకు దారితీయ వచ్చు. ప్రపంచంలో పైన ఎన్ని తగాదాలు, సంఘర్షణలూ, పరస్పర ద్వేషాలూ వున్నప్పటికీ, క్రమంగా సన్నిహిత సహకారానికీ సామరస్యానికీ ప్రపంచం ముందుకు సాగుతూనే వుంటుంది. భారత దేశం ఇటువంటి ప్రపంచ ఐక్యత కోసం కృషి చేస్తుంది. అంతర్జాతీయవ్యవహారాలలో అత్యంత ప్రధాన పాత్ర నిర్వహించవలసిన బాధ్యత, దైవికంగా పైనబడిన అమెరికా ప్రజలకు శుభసందేశం మనం అందజేస్తున్నాం. ప్రపంచ వ్యవహా రాలలో పెద్ద బాధ్యత నిర్వహిస్తున్న మరొక ఆధునిక రాజ్యమైన సోవియట్ యూనియన్‌కు కూడా మన శుభం సందేశం అందజేస్తున్నాం."

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం బలవత్తర రాజ్యాలు రెండు తలపడి ప్రపంచాన్ని మళ్ళీ యుద్ధ జ్వాలల్లో ముంచివేస్తాయని నెహ్రూ భయపడ్డారు. అందుకే కొరియాలోనేమి, ఇండో చైనా లోనేమి, కాంగోలోనేమి, ప్రపంచ శాంతిని పరిరక్షించాలన్న తాపత్రయం లో నెహ్రూ జాతీయ ప్రయోజనాలను ఉపేక్షించారని కొందరు విమర్శకులు అంటారు. అయితే, ప్రపంచంలో శాంతి సందర్శన కంటే, మించిన జాతీయ ప్రయోజనం భారత దేశానికి ఇంకొకటి

ఏమి వుంటుంది? యుద్ధమే వస్తే, మన దేశ ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరిచేందుకు మనం రూపొందించుకున్న పథకాలు భగ్నమై పోతాయి. సూయజ్ సంక్షోభం వంటి చిన్న సంఘర్షణ సహా మన పంచవర్ష ప్రణాళిక ప్రగతి ని కుంటుపరిచింది.

భాగ్యభోగ్యాలతో తులతూగే దేశాలకు శాంతి వాంఛనీయం అయితే, భారతదేశం వంటి వెనుకపడిన దేశాలకు శాంతి తప్పనిసరిగా అవసరం. దారిద్ర్యం వంటి ఈతిబాధలు తొలగించడానికి ఇటువంటి దేశాలకు శాంతి అత్యవసరం. ప్రపంచ శాంతి పరిరక్షణకై కృషి చెయ్యడం ద్వారానే నెహ్రూ వాస్తవానికి భారతదేశ సంక్షేమాభివృద్ధికి దోహదం కూడా చేశారు. ఆధునిక యుగంలో మహోత్తమ ఆదర్శ వాదియైన గాంధీ మహాత్ముడు వాస్తవిక వాది అయినట్లే మనతరం అత్యంత ప్రముఖ అంతర్జాతీయవాదియైన నెహ్రూ కూడా నిజమైన జాతీయవాది.

సంకుచిత దృక్పథంతో చూచి నప్పటికీ, అలీన విధానం మూలముగా భారత దేశానికి ఎన్నో విధాల మేలే కలిగింది. ఆర్థిక సహాయం ఉభయ పక్షాలనుంచి అందింది. పశ్చిమ దేశాలు, అందులోనూ ముఖ్యంగా అమెరికా, మనకు పెద్ద ఎత్తున సహాయం అంద చేసింది. అదేవిధంగా, భిలాయ్ వంటి బ్రహ్మాండమైన కర్మాగారాలు నెలకొల్పడానికి మనకు రష్యా నుంచి అత్యధికముగా సహాయము లభించింది. రెండు కూటాలనూ ఒక దానితో ఒక దానికి పోటీ పెట్టి ఉభయుల నుంచీ ఏదో విధంగా స్వార్థంసాధించు కోవాలని భారత దేశం ప్రయత్నిం చిందనడం ఎంత మాత్రం న్యాయం కాదు. అది వాస్తవం కూడా కాదు. ఉభయ కూటాల మధ్యానయోధ్య


3



సాధించడమే మన అలీన విధాన లక్ష్యం.

స్థూలముగా పరిశీలిస్తే చాలా నాగరిక దేశాలలో వాస్తవిక వాదుల వర్గము, మరొక వంక ఆదర్శ వాదుల వర్గం ఇలా రెండు వర్గాలూ ఉంటూ వచ్చాయి. భారత దేశం లో కూడా ఇటువంటి రెండు వర్గాలు ఉండేవి. కౌటిల్యుని రాజనీతి శిరోధార్యమని భావించే వారు మొదటివర్గం అయితే, అశోకుని ధర్మ ప్రబోధాలకు అనుగుణంగా శాంతి, అహింస ధర్మ నిష్ఠ అనుసరణీయమని భావించే వారు రెండవవర్గం. నెహ్రూ పాశ్చాత్య దేశాలలో విద్యాధ్యయనం చేసి వచ్చినా రాజకీయ వేత్తగా పెరిగి పెద్దవారైంది గాంధీ మహాత్ముని ప్రభావంతోనే. గౌతమబుద్ధుని ప్రబోధాల మూలంగా ప్రభావితుడైన మహనీయుడు అశోక చక్రవర్తి ఆయన ఆదర్శాలను ఆధునిక యుగంలో నెహ్రూ అభిమానించడం జరిగింది. అందువల్లనే ఉత్తమ ఆదర్శాలను సాధించడానికి దుష్ట సాధనోపాయాలు పనికిరావనీ, ధర్మబద్ధమైన కృషి మూలంగా సత్ఫలితాలు కలుగుతాయనీ నెహ్రూ విశ్వసించడం జరిగింది. ప్రపంచ చరిత్ర క్షుణ్ణముగా తెలిసిన వాడు కావడం చేత, ఇరుగుపొరుగు దేశాల మధ్య రకరకాల శత్రుత్వం సాగితే, ప్రజలు ఎంత దీర్ఘకాలం ఎటువంటి కష్టనష్టాలకు గురి అవుతారో ఆయనకు స్పష్టంగా తెలుసు. మన సరిహద్దును అనుకొని ఉన్నదేశం, మనకు శత్రుదేశమేనని కౌటిల్యుని నిర్వచనం. కాని నెహ్రూ ఈ పద్ధతి అవలంబించలేదు. కౌటిల్యుని నిర్వచనం సరియైనదని భావించి ఉంటే ఆయన మొదటినుంచీ చైనాను శత్రువుగా పరిగణించే వారే. కాని ఆయన అలా పరిగణించ లేదు. ఫ్రాన్సు, జర్మనీల మధ్య శతాబ్దాల తరబడి సాగిన శత్రుత్వం వంటిది, ఇండియా చైనాల మధ్య ఏర్పడకుండా నివారించ గలిగారు. ఫ్రాన్సు, జర్మనీల మధ్య ఏర్పడిన విరోధం అనేక యుద్ధాలకు, చివరకు, రెండు ప్రపంచ మహా సంగ్రామాలకు దారి తీసింది. ఈ రెండు దేశాల మధ్య ఏర్పడిన శత్రుత్వం మూలంగా మొత్తం ఐరోపా చరిత్ర కలుషితమై పోయింది.

ఆయా విషయాలు సమగ్రముగా పరిశీలించిన మీదట మన విదేశాంగ విధానంలో ఆశావాదంపాలు కొంచెము ఎక్కువ ఉన్నదనీ, పూర్తిగా ఫలప్రదము కాగలదనీమనము ఎక్కువగా ఆశలు పెట్టుకోవడం జరిగిందనీ అంగీకరించవలసి వస్తున్నది. మనం కూడా తప్పకుండా అలీన విధానానికి కట్టుబడి ఉంటే, దురాక్రమణ సంభవించదని ఆశించాం. రష్యాతో స్నేహ సంబంధాలు దృఢతరం చేసుకోవడంలో అలీన విధానం ఎంతగానో ఉపకరించడం మూలంగా ఇతర దేశాలు కూడా మన విధానాన్ని అదేవిధమైన సమరస దృష్టిలో అవగాహన చేసుకొంటాయని ఆశించాం. అంతేకాదు బలవంతుడిదే రాజ్యం అన్న వింత వాదానికి అంతర్జాతీయ వ్యవ

హారాలలో ఇప్పటికీ ఇంకా స్థానం ఉంటున్నదన్న విషయం మనం సమగ్రంగా గుర్తించలేదు. మనిషికీ మనిషికీ మధ్య ఒకేఒక సమస్య ఉన్నది. అదేమంటే ఎవరు బలవంతులో తేల్చుకోవడమే అని కార్లయిల్ ఒకగ్రంథంలో వ్రాశారు. ఇది రాతియుగంనాటి అనాగరిక సమాజంలో చెల్లుబాటయితే కావచ్చు. కాని నేటి పరిస్థితులలో ఇది చెల్లుబాటు కాదు. ఆధునిక యుగంలో ప్రపంచంలో నాగరికత అభివృద్ధి చెందిన అన్ని దేశాలలో శాంతి భద్రతల సంరక్షణకు పోలీసులు, వివాదాలను పరిష్కరించి, తీర్పు చెప్పి నేరం చేసిన వారిని శిక్షించడానికి న్యాయమూర్తులు ఉన్నారు.

ఇదేవిధముగా వివిధ దేశాల మధ్య నాగరిక వ్యవస్థ నెలకొని శాంతి సామరస్యాలు చిరస్థాయి కావడానికి తోడ్పడగల ప్రపంచ వ్యవస్థ ఇంకా రూపొందలేదు. యునైటెడ్ నేషన్సు ద్వారా ఇటువంటి కృషి స్వల్పంగానైనా ప్రారంభమైంది. శాంతి భద్రతలకు ఎక్కడ భంగం కలిగినా పరిస్థితిని అదుపులోనికి తీసుకొని రావడానికి యునైటెడ్ నేషన్సుతో భారతదేశం సంపూర్ణంగా సహకరిస్తున్నది.

—కెపిఎస్ మీనన్
దౌత్యనిపుణులు



## సోషలిస్టు వ్యవస్థ

నెహ్రూ మానవతా దృక్పథంలో, మత ప్రమేయంలేని దృక్పథంలో ఒక భాగం. మానవుని పట్ల ఆయనకుం అకుంఠిత విశ్వాసం వున్నది. సామాన్య ప్రజల స్థితిగతులను మెరుగు పరచడానికి, వారి మూఢ విశ్వాసాలను తొలగించడానికి, ప్రతి ఒక్కరికి సమానావకాశాలుండే నూతన వ్యవస్థను నిర్మించడానికి, ప్రజలందరికి కనీస జీవనవ్యయ ప్రమాణాలను కల్పించడమే నెహ్రూజీ లక్ష్యం.

మతాతీత దృక్పథం లేనిదే, భారత దేశానికి రాజకీయంగా భవిష్యత్తులేదని ఆయన గుర్తించారు. అందరికీ పౌరసత్వపు హక్కు, ఆరాధనా స్వాతంత్ర్యం, అభివృద్ధి చెందడానికి అందరికీ సమానావకాశాలు, అన్న సూత్రాలే ఆయన తత్వంలో ముఖ్యాంశాలు. చరిత్ర అంటే ఏవిటో ఆయనకు క్షుణ్ణముగా తెలుసు. పౌరసత్వానికీ, మతానికీ ఎట్టి సంబంధం లేదనీ శతాబ్దాలుగా భారతదేశంలో అనేక మతాలవారు పౌరసత్వం కలిగి వున్నారనీ, మాతృభూమికి వారందరూ విధేయులై వుండేవారనీ ఆయన గుర్తించారు.

గాంధీజీ, నెహ్రూలిద్దరూ మతాతీత సిద్ధాంతమందు విశ్వాసమున్నవారే. అయితే, వారి దృక్పథాలు వేరు. గాంధీజీ పూర్తిగా మతంపట్ల భక్తి గలవారు : అన్నిమతాలు ఈశ్వర సాక్షాత్కారమన్న లక్ష్య సాధనకు భిన్న భిన్న మార్గాలని ఆయన విశ్వాసం. మతాతీత ప్రజారాజ్య సిద్ధాంతం రాజకీయంగా నూ, అధ్యాత్మికంగానూ, మహోన్నత

ఆశయమని నెహ్రూ విశ్వాసము. ఒక్క భారత దేశమే గాక, ప్రపంచంలోని అన్ని దేశాలూ, ఏనాటికైనా, బహుజాతి, బహుభాషా, బహు సంస్కృతుల సాంఘిక సిద్ధాంతంగా దీనిని అంగీకరించి అమలు జరపక తప్పదని నెహ్రూ విశ్వాసం.

పండిట్ నెహ్రూ ప్రజాస్వామ్యవాది అవునా కాదా అన్న అంశాన్ని పరిశీలించవల్సిన అగత్యం ఏమిటని మీరు ప్రశ్నించవచ్చు. ప్రజాస్వామ్యం అటు వ్యక్తికీ, యిటు దేశానికీ సంబంధించినది. అందులో వ్యక్తిగతమైనవీ వున్నాయి, సంస్థాపరమైన వీవున్నాయి. వ్యక్తి గతంగా నెహ్రూ ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడివున్న వ్యక్తి అనేది సుస్పష్టం. వ్యక్తి స్వేచ్ఛ, ప్రతిపక్షాలకు ప్రభుత్వాలని విమర్శించే హక్కు వుండాలని ఆయన విశ్వాసం. పార్లమెంటరీ ప్రభుత్వం, పత్రికలకు స్వేచ్ఛ, స్వతంత్రంగా వ్యవహరించే న్యాయవ్యవస్థ వుండి తీరాలని ఆయన అనేవారు.

రాజకీయాలు అధికారానికి సంబంధించినవి. ఆ అధికారాన్ని క్రమబద్ధంగా వినియోగించే పద్ధతే ప్రజాస్వామిక పద్ధతి. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛాపూరిత సంస్థలు చిన్నవీ, పెద్దవీ వుంటాయి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచీ, ఇతర సంస్థలు వెనకబడి, ప్రభుత్వమే ఒక సంస్థగా ముందుకు సాగుతోంది.

దీర్ఘ కాలం నాయకత్వం పదవిలో వుండి, ప్రజాస్వామిక బద్ధులైన ప్రజలనూ, సంస్థలనూ తయారు చేయడం సామాన్యం కాదు. పండిట్‌జీ ప్రజాస్వామిక విశ్వాసాలు శాశ్వతంగా విరాజిల్లుతున్నాయి. దయ, న్యాయ్యం ఆయనలో మూర్తీభవించివున్నందునే, ప్రజాస్వామ్యం వర్ధిల్లింది.

—చంచల్ సర్కార్
రాజనీతి పరిశీలకులు



## శాస్త్రీయ దృక్పథం

దేశంలో ఎదుర్కోవలసి వచ్చే వివిధ సమస్యల పరిష్కారానికి శాస్త్రీయ దృక్పథం ఏర్పడడానికి నెహ్రూ నిర్విరామంగా కృషిచేశారు. వైజ్ఞానిక శాస్త్రంలో ఆయనకు ప్రగాఢమైన విశ్వాసం ఉన్నది. దేశంలో వివిధ సమస్యలను శాస్త్రీయమైన పద్ధతి అవలంబించి పరిష్కరించడం అవసరమనీ, వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రాల సాయం లేకుండా దేశం పురోగమించలేదనీ ఆయన విశ్వసించారు.

అణుశక్తి వ్యవహారాల శాఖ మంత్రిగా ఉండడమే కాక నెహ్రూ, శాస్త్ర, పారిశ్రామిక పరిశోధన సంఘం అధ్యక్షులుగా కూడా పనిచేశారు. ఆయన తీవ్ర కృషి మూలంగానే వైజ్ఞానిక రంగంలో అభివృద్ధి సాధన జరిగింది. అణుశక్తి సంస్థకూ శాస్త్ర పారిశ్రామిక పరిశోధన సంఘానికీ ప్రారంభంనుంచీ జీవితకాలం ఆయనే అధ్యక్షులుగా ఉంటూ వచ్చారు. ఏదేశ పురోగమనమైనా ఆధునిక సాంకేతిక

# చందా

## రచనలు

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్‌మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్గిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవ చైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం

ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారిటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

విజ్ఞానం సహాయంతో సాధించిన పారిశ్రామిక అభివృద్ధి పైనే ఆధారపడి ఉంటుంది.

విశ్వవిద్యాలయాలలో బోధనావకాశాలు పెంపొందింప చేస్తే మన శాస్త్రజ్ఞుల సంఖ్య పెరిగే అవకాశం ఉన్నదనీ ఆయన అన్నారు. అణుశక్తి సంస్థ ఏర్పాటు కావడంలో ఆయన ఆశలు ఫలించాయి. అణుశక్తి రంగంలో యువ శాస్త్రజ్ఞులకు శిక్షణ జరిపేందుకు కళాశాల ఒకటి నిర్వహిస్తున్న ఈ సంస్థ, క్రమాభివృద్ధి చెందడానికి నెహ్రూ ఎంతో దోహదం చేశారు.

నెహ్రూ తరచుగా ట్రాంబే విచ్చేసినప్పుడల్లా నాకు ఆయన్ను కలుసుకునే అదృష్టం కలుగుతూ వుండేది. ఇక్కడ వివిధ పరిశోధనాలయాలలోనూ ఫ్యాక్టరీలలోనూ జరుగుతున్న కార్యక్రమాల పట్ల ఆయన ఎంతో ఆసక్తి కనపరిచారు. అంతేకాదు ఇక్కడ పని చేస్తున్న యువ శాస్త్రజ్ఞుల నందరినీ స్వయంగా కలుసుకొని అన్ని విషయాలూ అడిగి తెలుసుకొంటూ ఉండేవారు. అందువల్ల ఇక్కడి శాస్త్రజ్ఞులకు మంచి ప్రోత్సాహం కలిగింది.

—హెచ్చెన్ సేత్నా
అణుసంస్థ డైరక్టర్

## మానవతావాది

చాలా దశాబ్దాల వరకూ నెహ్రూయే భారత దేశమని, ఆయనతోనే 45కోట్ల భారతీయుల భవిష్యత్తూ, ముడిపడి వుందని ప్రపంచమంతా భావించింది. భారత దేశము రెండు వందల సంవత్సరాలు వలస బానిసత్వంలో వుంది. అయినప్పటికి చాలా మంది ప్రపంచ ప్రజలనదిఆకర్షించింది. పీడింపబడుతూ దారిద్ర్యంలో పడి కొట్టు మిట్టాడుతూ ఎన్నో కష్ట పరిస్థితులను ఎదుర్కొంటూ వున్నప్పటికి భారతీయులు తమ సంస్కృతినీ, ప్రత్యేకతనూ కాపాడుకున్నారు. స్వాతంత్ర్యము లభించడంలో వారు ఒక అద్వితీయమైన కార్యోత్సాహంతోను, స్వతంత్ర వాణితోనూ ముందుకు వచ్చారు.

గొప్ప దేశభక్తులైన నెహ్రూ తమ దేశ స్వాతంత్ర్యం కోసము పోరాడటమే గాక, ఆధునిక భారత దేశానికి పునాదిని కూడ వేశారు. మహోన్నతమైన భావాల ద్వారానూ, ప్రజానీకంతో సన్నిహిత సంబంధము ద్వారాను, నిరాడంబరత ద్వారాను, న్యాయబుద్ధి ద్వారాను, ఆయన ఐతిహాసిక భారత దేశానికి ప్రాతినిధ్యం వహించ గలిగారు.

నెహ్రూ ఒక ప్రముఖ రాజకీయ వేత్త, శాంతియోధుడు, ప్రజ్ఞావంతుడైన పండితుడు, చక్కని వక్త, తమ దేశ ప్రజల చరిత్రను గురించీ సంస్కృతిని గురించీ పరిపూర్ణంగా తెలిసినవారు. గొప్ప మేధస్సు, గొప్ప హృదయమూ గలవారు.

ఆయన తత్వమంతా, స్వాతంత్ర్యాన్ని భారతీయ ప్రజానీకానికి వాస్తవమైనదిగా చేయాలనే కోరికతోనే నిండి వుండేది. అందుచేతనే ఆయన, దేశపు

ఆర్థికాభివృద్ధి పథకాలలో సోషలిస్టు ప్లానింగును ప్రవేశపెట్టారు. స్వాతంత్ర్య ఫలితాలు అందరికీ అందుబాటులో వుండేటట్లు చేయడానికే ఆయన ఆ పద్ధతిని అవలంబించారు.

తగినంత అభివృద్ధిని సాధించడము కోసము చేపట్టిన కార్య క్రమాలన్నిటికీ కావలసినన్ని ఆర్థిక వనరులు భారత దేశానికి లేవని, విదేశీ సహాయము అవసరమని ఆయన తెలుసుకున్నారు. ఈ విషయములో కూడ అయన వాస్తవికదృక్పథాన్నే అవలంబించారు. తమ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగాన్ని ఇతర పెట్టుబడిదారీ దేశాలు బలపర్చవని అయన గుర్తించారు. అందుకనే, భారతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వ రంగాన్ని నెలకొల్పడంకోసము ఆయన సోషలిస్టు దేశాల, ఇతర మిత్రదేశాల సహాయము మీద ఆధారపడ్డారు. ఇంతవరకు భారత దేశంలో అమలు జరుపబడిన మూడు పంచవర్ష ప్రణాళికలు కూడా నెహ్రూ రూపొందించినవే. చివరివరకూ ఆయన ప్లానింగు కమీషన్ అధ్యక్షులుగానే వున్నారు. అభివృద్ధి పథకాలను రూపొందించడంలో స్వయముగా పాల్గొన్నారు.

భారత జీవితంలో ఇతర అంశాల పట్ల కూడా నెహ్రూ చాలా శ్రద్ధ వహించేవారు. విజ్ఞాన శాస్త్రాన్ని, సంస్కృతిని, ప్రజారోగ్యాన్ని, విద్యా బోధనను అభివృద్ధి చేయడంలో అయన ముందడుగు వేశారు. పారిశ్రామిక రంగంలో లోహ పరిశ్రమ, యంత్ర నిర్మాణ పరిశ్రమ లాంటి ముఖ్యమైన శాఖలను ఏర్పాటు చేశారు భారత దేశం నేడు తన స్వంత చమురు పరిశ్రమను, విద్యుత్ కేంద్రాలను నిర్మించుకుంటోంది. 1947లో భారతదేశంలో 10 లక్షల టన్నుల ఉక్కు మాత్రమే ఉత్పత్తిఅయేది 1964లో అది 60 లక్షల టన్నులకు పెరిగింది. అదే కాలంలో పారిశ్రామిక ఉత్పత్తి, వ్యవసాయోత్పత్తి 50 శాతం పెరిగాయి.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ప్రజల ఆశలు నెరవేరాలంటే ప్రపంచంలో శాంతి అవసరమనీ, అది లేకుండా అవి నెరవేరజాలవనీ ఆయనకు తెలుసు. శాంతి నెలకొన్నప్పుడే ప్రపంచములోని వనరులు వర్ధమాన దేశాల అభివృద్ధికి ఉపయోగపడగలవనీ ఆయన గుర్తించారు.

ఒకసారి నెహ్రూ ఇలా అన్నారు : 'యుద్ధాలకు దిగకుండా వుండట మొక్కటే శాంతి కాదు, అంతర్జాతీయ సంబంధాలన్నిటి పట్ల మనము క్రియాత్మక దృక్పథాన్ని అవలంబించాలి. సమస్యలన్నిటినీ సంప్రదింపుల ద్వారానే పరిష్కరించుకోవాలనే కోరిక, మొట్టమొదట అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలింప చేస్తుంది. ఆ తరువాత వివిధ దేశాల మధ్య సాంస్కృతిక, వైజ్ఞానిక సంబంధాలను పెంపొందించు కోడంలోనూ, వాణిజ్యాన్ని విస్తరింప జేసుకోడంలోనూ, ఒకరి భావాలను, అనుభవాన్ని, సమాచారాన్ని మరొకరికి అందజేసు

కోడంలోనూ మరింత ఎక్కువ సహకారానికి దారితీస్తుంది.

అలీన విధానాన్ని వివరించడంలోనూ, దాన్ని అమలు జరపడంలోనూ నెహ్రూ బాలా తోడ్పడ్డారు. అలీన విధానమే భారత దేశపు విదేశాంగ విధానానికి ప్రధాన సూత్రమని ఆయన ప్రకటించారు. జీవితాంతము వరకూ ఆయన దానికే కట్టుబడివున్నారు.

—ఎన్ స్మిర్నోల్
చరిత్ర పరిశోధకులు



## నవంబరు 14

రాజకీయ వివేకమూ, సూక్ష్మదృష్టి గల రాజనీతిజ్ఞత, జీవితం పట్ల అపారమైన ప్రేమ ఆయనలో మూర్తీభవించాయి. ఆయన ఒక మనోహరమైన వ్యక్తి. దయా స్వభావులు, చురుకైన వారు. ఆయన నేత్రాలు ఆనందంతో మెరుస్తూ వుంటాయి; ఒక్కొక్కప్పుడు అవి విచారపూరితాలవుతాయి. ఆయన చమత్కారి, పిల్లలపట ఆయనకున్న ప్రేమ అసాధారణం. ఆయన ధరించే షేర్వాణిపై ఎల్లప్పుడూ ఒక రోజా పుష్పం వుంటుంది. ప్రకృతితోనూ, మానవ జీవితంతోనూ సృష్టిలో సజీవమైన ప్రతిదానితోను ఆయనకుగల ఎడబాయని బాంధవ్యాన్ని అది తెలియజేస్తూ వుంటుంది; ఆయనే జవహర్ లాల్ నెహ్రూ.

పార్లమెంటులోనూ, ప్రయాణించే విమానంలోనూ, పత్రికా విలేఖరుల గోష్టులలోనూ, క్రికెట్ ఆటలోనూ, బ్రహ్మాండమైన బహిరంగ సభలలోనూ, ప్రశాంతమైన పఠన మందిరంలోనూ నేను ఆయనను చూశాను. నెహ్రూకున్న లక్షణాలలో నన్ను ఎక్కువ ముగ్ధుణ్ణి చేసినది ఏమిటని ఎవరైనా అడిగితే, పిల్లలపై ఆయనకుగల ప్రేమ అని చెబుతాను. నెహ్రూ జన్మదినమైన నవంబరు 14 వ తేదీన భారతీయ బాలబాలికలకు పండుగ దినమవడం చాలా ప్రాముఖ్యత గల విషయం. 1951 మార్చి నెలలో, హోలీ పండుగ నాడు నేను నెహ్రూను తొలిసారి కలుసుకున్నాను. అప్పుడాయన తమ బసలో ప్రజా ప్రతినిధులకు స్వాగతము చెబుతున్నారు. ఆయన దుస్తులు, ముఖం, చేతులూ అన్నీ ఇంద్రధనుస్సులాగ రంగులతో నిండి వున్నాయి. నేను ఆశ్చర్య పడ్డాను. దానిని గమనించి ఆయన నవ్వుతూ యిలా అన్నారు: 'మా ప్రజలకు యీ పండుగ ప్రియమైనది. నాకు నా ప్రజలు ప్రియమైన వారు'.

నిజంగానే నెహ్రూ తమ ప్రజలను హృదయ పూర్వకంగాను అత్యంతంగానూ ప్రేమించారు. సోవియట్ దేశంలో అయిదర్లీ పర్వతం మీద నిలబడి బ్రహ్మాండమైన సోవియట్ లోహ పరిశ్రమ 'మాగ్నితో గోర్స్క్'ను దాని పరిసరాలను తిలకిస్తూ వుండగా నేను నెహ్రూను మళ్ళీ చూశాను. ఆ పరిశ్రమకు సోవియట్ ప్రజల సృజనాత్మక కృషికి తమ ప్రశంసలను తెలిపేటప్పుడు నెహ్రూ భారత దేశంలోని

భిలాయ్ ఉక్కు కర్మాగారాన్ని గురించి ఆలోచిస్తున్నారు. అప్పటికి భిలాయ్ ఒక ఎర్రని ఎడారి తమ దేశానికీ, తమ ప్రజలకు 'మాగ్నిటో గోర్స్క్' లాంటి ఉక్కు పరిశ్రమ కావాలి. అదే అప్పుడు నెహ్రూ ఆలోచన.

తమ దేశంలో నెహ్రూ జరిపిన అసంఖ్యాకమైన సంచార కార్యక్రమాలలో ప్రజలపట్ల ఆయనకున్న ప్రేమ ఎంతో నేను చూడగలిగాను.

నెహ్రూ జన్మదినమైన నవంబరు 14 భారత దేశంలోని బాలబాలికలందరికీ పండుగ దినం. పిల్లలంటే నెహ్రూకు అపరిమితమైన ప్రేమ ఇంకా కొద్ది గంటలకు చనిపోతారనగా కూడా ఆయన పిల్లలతో కలిసి ఫోటో తీయించుకున్నారు. భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తొలి సంవత్సరాలలో నవంబరు 14పండుగలోపాల్గొన్న భారతీయ బాలబాలికలు నేడు నెహ్రూ కలలను నిజం చేయడానికి పోరాడే వీరులయారు. ఆయన ఆశయం నేడు వారి చేతులలో వుంది. ఆయన కలలు నిస్సందేహంగా నిజాలవుతాయి.

- ఎన్ పస్తుఖోవ్
సోవియట్ రచయిత

## పరిషత్తు — మ్యూజియము

దేశంలో విజ్ఞానం వెల్లివిరియాలనీ దేశ ప్రజల మనోవికాసం నూతనౌన్నత్యాలు సాధించాలనీ నెహ్రూ అహరహము తపించారు. అందుకే, విజ్ఞాన శాస్త్రాలూ ఇతిహాసాది శాస్త్రాలల్లో ఉన్నత విద్యాధ్యయనానికి సౌకర్యం గల విద్యాపీఠాన్నొకదానిని ఆయన పేరిట, 'నెహ్రూ పరిషత్తు'గా నెలకొల్పాలని స్మారక నిధి సంస్థ నిర్ణయించింది. ప్రముఖ విద్యావేత్తలతో కూడిన ఒక ప్రత్యేక సంఘం యీ విద్యాసంస్థ స్థాపనకు సంబంధించిన సమగ్రపథకాలను రూపొందిస్తోంది.

ఇప్పుడు దేశంలో వున్న విశ్వవిద్యాలయాలవంటిది కాదు యీ పరిషత్తు. దీనినొక విశిష్టమైన విద్యాసంస్థగా రూపొందించాలని తలపెట్టారు. యోగ్యులైన విద్యార్థులకే యీ సంస్థలో ప్రవేశం కల్పిస్తారు. విదేశీ విద్యార్థులు కూడా యిందులో జేరవచ్చు. వివిధ జీవన రంగాలలో ఉత్తమ నాయకత్వాన్ని రూపొందించడమే యీ సంస్థ ముఖ్యలక్ష్యం. మంచి అర్హతలు గల విద్యార్థులు యీ సంస్థలో జేరడానికి తగు ప్రోత్సాహం కల్పించడానికి గాను విద్యార్థి వేతనాలుకూడా యిస్తారు.

ఈ సంస్థలో ఉన్నత విద్యాధ్యయనానికి ఇతిహాసాదిశాస్త్రాలూ ప్రకృతిశాస్త్రాలూ, సాంఘిక శాస్త్రాలూ, వీటిలో ప్రముఖమైనవాటిని ఎన్నిక చేస్తారు. సాంకేతిక విజ్ఞాన తరగతులను ఏర్పాటు చేయడం లేదు. ఈ సంస్థలో ఉన్నత పరిశోధనలకే హెచ్చు ప్రాముఖ్యం కల్పించినా, అందుకు అర్హులైనవారు తగినంత మంది లభించడానికివీలుగా, క్రింది స్థాయిలో వారికి తగు శిక్షణ కల్పించ

అవసరంకదా! అందుకే ఏటేటా పోటీ పరీక్షలు నిర్వహించి, వాటి ఫలితాలనుబట్టి, పట్టభద్రులుగా శిక్షణ జరపడానికి కొద్దిమంది విద్యార్థులను చేర్చుకుంటారు.

నెహ్రూకు ప్రీతి పాత్రమైన సమస్యల పరిశీలనకే యీ సంస్థలో హెచ్చు శ్రద్ధ వహించబడుతుంది. ఈ పరిషత్తు స్థాపనోద్దేశ్యం కూడా అదే కదా! ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కృషి, జాతీయ సమైక్యత, అంతర్జాతీయ శాంతి సామరస్యాల సాధన - వీటికి సంబంధించిన సమస్యలపై యీ సంస్థలో ప్రత్యేక పరిశీలన సాగుతుంది. ఇప్పటి విశ్వవిద్యాలయాలలో పని చేస్తున్న అధ్యాపకులకు ప్రత్యేక శిక్షణ తరగతులు నిర్వహించేందుకుగాను క్రమేణా యీ సంస్థలో ఏర్పాటు జరుగుతుంది.

ఈ పరిషత్తు పూర్తిగా స్వయం పాలనాధికారం గల విద్యాసంస్థ, క్రమేణా జాతీయ ప్రాముఖ్యం గల విద్యా సంస్థగా యిది రూపొందగలదు.

జవహర్‌లాల్ నెహ్రూ స్మారక మ్యూజియంగా రూపొందించిన తీన్ మూర్తి భవనం, నెహ్రూ జీవితకాలంలో రాజకీయ కలాపాలకు కేంద్రంగా నాయకత్వ పీఠంగా విరాజిల్లింది. సమస్యలలో సతమతమౌతున్నవారు అక్కడికి వెడితే, నెహ్రూ వారికి అభయమిచ్చి వారిలో కొత్త ఆశలనూ, విశ్వాసాన్నీ చిగురింప చేసేవారు. ఇప్పుడా భవనం స్మారక మందిరంగా ఆరాధ్య పీఠంగా రూపొందింది. మ్యూజియంగా మార్చబడిన ఆ భవనంలోని ఆ గదులు, నెహ్రూ రాజకీయకోలాహలాలనూ, అప్పటి సందడిలనూ స్ఫురణకు తెస్తాయి.

మొదటి అంతస్థులోని పఠన మందిరము, పడక గది చెక్కు చెదరకుండా అల్లాగే వున్నాయి. విదేశ వ్యవహారాల మంత్రిత్వశాఖ కార్యాలయంలోని బల్లలూ కుర్చీలూ సోఫాలూ మొదలైన వాటిని అక్కడ నుంచి ఈ భవనానికి తెచ్చారు. ప్రధాన మంత్రిగా, విదేశాంగ శాఖ అధిపతిగా, దైనందిన వ్యవహారాలను చూచుకుంటూ, అధికారరీత్యా వచ్చే అతిధులకు స్వాగతమిచ్చిన గదికి ప్రతిగా అదే ఆకారం, అదే విస్తీర్ణం గల ఒక గదిలో వీటిని అమర్చారు. ఆ భవనం తూర్పు భాగంలోని మిగతా గదులను ప్రదర్శన గదులుగా రూపొందించారు. ప్రదర్శన సామగ్రిని, ముఖ్యంగా నెహ్రూ ఫొటోలనూ, వ్రాత ప్రతులను, భద్రపరచడానికి రెండు పెద్ద గదులను కేటాయించారు.

నెహ్రూ అధికార హోదాలో పర్యటించినప్పుడు, ఆయా దేశాలవారు బహూకరించిన వస్తువులనూ భారత దేశాన్ని సందర్శించ వచ్చిన విదేశ ప్రతినిధి వర్గాలు ఆయనకు బహుకరించిన వస్తువులనూ యించుమించుగా అన్ని దేశాలకూ ప్రాతినిధ్యం లభించే రీతిలో, కొన్నింటిని ఎన్నికచేసి, వాటిని ఇతర గదులలో వుంచారు. అంతర్జాతీయ స్థాయిలో భారతదేశం నెలకొల్పుతున్న సత్సంబంధాలకూ, నెహ్రూ పట్ల ప్రపంచ ప్రజల విశేష గౌరవ

ప్రేమలకూ ఆ బహుమతులు ప్రబల తార్కాణాలు. ఆయన వివిధ విశ్వ విద్యాలయాల నుంచి పొందిన పట్టాలూ స్వదేశ విదేశ విశ్వవిద్యాలయాలు బహూకరించిన గౌ ర వ బి రు దు లు సన్మాన పత్రాలూ వేరొక గదిలో ప్రదర్శించారు. ఆయన విద్యార్థి దశ చివరలో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం ఇచ్చిన పట్టాదగ్గర నుంచి, తరువాత జీవితంలో లభించిన గౌరవపట్టాల వరకూ, ఆ గదిలో చూడవచ్చు. అత్యు, త్తమ సేవా పరిగణకు 1955 లో ఆయనకు బహూకరించిన 'భారత రత్న' బిరుదు పత్రం కూడా అక్కడుంది. వివిధ సంస్థల ప్రారంభోత్సవాల సమ యాలలోనూ, శంకుస్థాపనల సందర్భం లోనూ లాంఛనంగా ఆయన ఉప యోగించిన కత్తెరలు, తాపీలు విదేశా లలో పర్యటించినప్పుడు పౌరస్వేచ్ఛకు అనుమతి చిహ్నముగా నగర పాలక సంస్థలు బహూకరించిన తాళాలు కూడ ఈ గదిలో వున్నాయి. ఆయన ఉపయో గించిన చరఖా, ఆయన నూలువడుకు తున్నటు చూపిస్తున్న ఫొటో ఏరోజున ఎంత నూలు వడికినదీ స్వయంగా ఆయన లెక్క వ్రాసుకున్న నోటు పుస్తకము, ఆయన వడికిన సన్ననూలు తో నేసిన వస్త్రముతో తయారు చేసిన రెండు ఉడుపులూ కూడా ఆ గదిలో ప్రదర్శింపబడ్డాయి. తూర్పు వైపున గల యితర ప్రాంతాలు ఎట్టిమార్పులు లేకుండా, ఆయన జీవితకాలంలో ఎలా ఉండేవో అలాగే ఉం చ బ డ్డా యి. ఆయనకు సుపరిచితమైన ఆ వాత వరణం చెక్కు చె ద ర కూ డ దన్న భావంతో యథాతథంగా వుం నిచ్చారు. ఆయన విహరించిన సుందర ద్యానము. ఋతు క్రమాన్ననుసరిం మరింత శోభాయమానంగా తీర్చిదిద్ద బడుతున్నది.

నెహ్రూ స్మా ర క మం ది రా న్ని 1964 నవంబరు 14న ఆయన జన్మ దినోత్సవం రోజున ప్రజల సందర్శన కోసము తెరిచారు. అది మొదలు ఇప్పటి దాకా కొన్ని లక్షల మంది ఆ మ్యూజి యము చూశారు. నెహ్రు స్మారక చిహ్నంగా, పవిత్ర యాత్రాస్థలముగా పరిగణిస్తున్న ఆ మ్యూజియము ప్రజలు అప్పటి నుంచీ తండోపతండాలుగా వచ్చి దర్శించి వెడుతున్నారు. శలవు రోజులలో ప్రవేశం కోసం ప్రజలు క్యూలో గంటల తరబడి వేచివుండ డము పరిపాటి అయింది. ప్రభుత్వ అతిధులు, విదేశీయులు ఆ మ్యూజియం కు వచ్చి, మహానాయకునికి జోహార్లర్పి స్తున్నారు. ఆయనపట్ల విశేష గౌరవా భిమానాలకు తగినట్లు మౌనం వహించి ఆ మహానాయకుని స్మారక చిహ్నాలను ఒకటొకటిగా చూస్తూ ఉంటే, ఆధునిక భారత దేశం జాతీయతా జీవనాన్ని ప్రతిబింబింపచేసే ఆ చిహ్నాలు ఎవరి హృదయాలనైనా ద్ర విం ప చే య క మానవు.

—గ్రేస్ మోర్లే

డైరక్టరు జాతీయ మ్యూజియం



## యుగపురుషుడు

భారత జాతి పునరుజ్జీవనానికి శ్రీ నెహ్రూ అనేక విధాలుగా చేసిన అఖండమైన కృషి ఫలితాలను అప్పుడే మదింపు చెయ్యడానికి సమయం ఆసన్నంకాలేదు. శ్రీ నెహ్రూ తన సర్వస్వాన్నీ భారత ప్రజల కోసం త్యాగంచేశారు. అందుకు ప్రతి ఫలితంగా ప్రజల హృదయపూర్వకమైన ఆదరాభిమానాలు ఆయనకు లభించాయి. ఇందుకు పూర్వం ఎన్నడూ ఏ రాజకీయ నాయకుణ్ణీ కూడా ప్రజలు ఇంతగా గౌరవించలేదు. ఆయన యుగ పురుషుడు. ఆయన నిర్యాణంలో ఒక శకం అంతమైంది. ఆయన కృషి మూలంగా ఆయన తర్వాత కూడా దేశానికి ఉత్తమ నాయకత్వం లభించింది. ఎటువంటి విషయ సమస్యలనైనా ఎదుర్కొనేందుకు ప్రజలను ఆయన సమాయత్త పరచారు.

భారతదేశం వంటి దేశంలో ప్రజాస్వామ్యం, మతప్రమేయం లేని లౌకిక రాజ్యం స్థిరపడితే తప్ప జాతీయ సమైక్యతను సాధించడం కష్టం. దేశంలో ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థను ఏర్పాటు చెయ్యడానికి కృషి చేసిన వారిలో నెహ్రూ అగ్రగణ్యులు. స్వాతంత్ర్య పోరాటం సాగిన కాలం నుంచే నెహ్రూ ప్రజలను ప్రభావితులను చేశారు. ఆయన ప్రధానమంత్రి అయిన తర్వాత ఆయనశక్తి సామర్థ్యాలు మరింత ప్రస్ఫుటంగా కన్పించాయి. గాంధీ మహాత్ముడు, సర్దార్ వల్లభాయ్ పటేల్, మౌలానా అజాద్ స్వర్గస్థులైన తర్వాత రాజకీయ విజ్ఞత విషయములో అయితేనేమి, మేధా సంపన్నత విషయంలో అయితేనేమి. పరిపాలనా దక్షత విషయంలో అయితేనేమి నెహ్రూతో సమ ఉజ్జీగా పేరొందగిన వ్యక్తి లేరనే చెప్పవచ్చును. రాజకీయ, జాతీయ సమైక్యతా సాధనకు గట్టి కృషి ప్రారంభమైంది. భారత దేశ సమైక్యతకు మతాతీత దృక్పథం అవసరమని శ్రీ నెహ్రూ ఏనాడో గుర్తించారు. లౌకిక రాజ్య వ్యవస్థా నిర్మాణానికి తీవ్రమైన కృషి చేశారు. జాతీయ సమైక్యత సాధించడానికి దేశ ప్రజలలో ఆర్థిక అసమానతలను తొలగించాలని ఆయన సంకల్పించారు. నవభారత నిర్మాణానికి సర్వమత సహనం, ప్రజాస్వామ్యం, ఆర్థికాభివృద్ధి అత్యవసరమని గుర్తించిన చిరస్మరణీయులు శ్రీ నెహ్రూ.

—హుమయూన్ కబీర్
విద్యావిజ్ఞానవేత్త

**1966 డిసెంబరు 'జగతి' నుంచి పునర్ముద్రితం**

అందరినీ సంతోష పెట్టాలనుకొనే వారు ఎవరినీ సంతోష పెట్టలేరు.

అహింసా విధానమవలంబించనిదే, సత్యపథం తెలుసుకోవడం సాధ్యం కాదు. -గాంధీజీ సూక్తులు

## గురువునీ, నాయకునీ చేరబోయిన అమరజీవి

# లాల్ బహదూర్ శాస్త్రి

'దేహినో అస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా తథా దేహాంతర ప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి' అన్నారు రాష్ట్రపతి రాధాకృష్ణన్, లాల్ బహదూర్ శాస్త్రి మరణించారన్న వార్త వినగానే! గాంధీ - నెహ్రూల అడుగుజాడలలో నడిచి వారి వారసత్వాన్ని నిలబెట్టిన ఈ ధీరుడు అక్షరాలా కర్మవీరుడు. పద్దెనిమిది నెలల క్రితం, ఈ వామనమూర్తి ఇంత బరువు మోయగలడా అని అజ్ఞానంతో తలపోసిన ప్రపంచం, ఈ త్రివిక్రముని శక్తి సామర్థ్యాలకు, కార్యదక్షతకు అచ్చెరు వొంది జోహారులర్పించింది.

గాంధీగారు ఈ భారత ఉపఖండంలో సామరస్య మేర్పరచాలని చివరికి తమ అసువులనే హారతిగా అర్పించారు. నెహ్రూజీ తన పదిహేడేళ్ళ ప్రధానమంత్రిత్వంలో, మతాతీత రాజ్యాంగ విధానం వైపు ప్రజాదృష్టిని మళ్ళించి, మత మౌఢ్యంనుంచి జాతిని తేవనెత్తారు. లాల్ బహదూర్‌శాస్త్రి భారతీయుల శాంతివచనాలు పిరికి వాళ్ళ పలుకులు కావనీ, కొరియా యుద్ధంనుంచి నేటి వరకూ తాము శాంతిస్థాపనకై చేస్తున్న కృషిని కొందరు చిత్తశుద్ధితో పరికించడం లేదనీ, భారత సరిహద్దులపై ఎవరు ఎటువంటి దురాక్రమణ జరిపినా తగు రీతిని జవాబు చెబుతామనీ అనడమే గాక, ఆ చెప్పే జవాబు ఎలా వుండేదీ మచ్చు చూపగల అవకాశం భారతనౌకా సైనిక విమానదళాలకు కలిగించారు. మొగలాయీ సామ్రాజ్యపు కలల నుంచి తేరుకోని కొందరు ప్రబుద్ధులు, ప్రపంచమంతటికీ ప్రథమస్థానం వహిస్తున్న ఒక ప్రజాస్వామ్య శక్తిని పాటన్, షెర్మాన్ టాంకులు అడ్డలేవని తెలుసుకున్నారు. భారతీయులు శాంతిదూతలే గాక సమర భూమిని ఎవరికీ తీసిపోని శూరులు సుమా - అని లోకానికి వెల్లడించిన ఘనకీర్తి లాల్ బహదూర్‌శాస్త్రిది.

అల్లరి చేయవద్దని మంచి మాటలతో చెబితే వినని బాలుని, తల్లి రెండు తగిలించడం వంటివే ఈ యుద్ధాలు. పంచశీల పత్రమును చించి, చైనీయులు టిబెట్‌ని ఆక్రమిస్తే మన కెందుకు లెమ్మని వూరుకున్నాం; కాశ్మీరులో పాకిస్థాన్ తిష్ట వేసుకు కూచుంటే, నెమ్మది మీద పరిస్థితులు చక్కబడతాయేమోనని సరిపెట్టుకున్నాం. కాని, భారతీయుల సౌజన్యాన్ని, చేత కాని తనంగా భావిస్తున్న యిరుగుపొరుగులకి ఒక గుణపాఠం చెబితేగాని ఈ అల్లరి సర్దుమణగదని, అంతమేరకే యుద్ధాన్ని సాగనిచ్చారుశాస్త్రి. భారత

సేనలు లాహెూర్ నగరం ప్రవేశించి వుండేవి; కాని, శాస్త్రి వొద్దన్నారు, 'పాకిస్థాన్‌లో మనకి ఒక్క అంగుళం కూడావద్దు; వారూ మనం సఖ్యంగా వుంటూ, ఈ ఉపఖండంలోని ప్రజను ఆకలి దారిద్ర్యాలనుంచి లేవనెత్తాలి' - అన్నారు.

తమతో భారీ యెత్తున యుద్ధం చేస్తూ, అంతర్జాతీయ న్యాయసూత్రా లని వుల్లంఘించి ఆస్పత్రుల మీద ఆలయాలమీద అమానుషంగా బాంబులు విసురుతున్న శత్రువు పై, ఒక దేశప్రధాని యిటువంటి దయ, సహనమూ కనబరచగలడా అని పాశ్చాత్య ప్రజకూ, బయట దేశాల వారికీ సందేహం కలగవచ్చు. కానీ, మనకి అటువంటిది కలగదు. ఎందుచేత నంటే, 'నన్ను రెండుగా కొయ్యిగాని, దేశాన్ని రెండు ముక్కలు చేయకు' - అని జిన్నాను బతిమిలాడిన గాంధీగారి శిష్యునిలో కరుణ రసవాహిని తప్ప క్రోధాగ్నిజ్వాల ఎలా వుంటుంది?

'అరియలూర్ రైలు ప్రమాదంలో గాని, మరొకరైలు ప్రమాదంలోగాని నా బాధ్యత ఏమీ వుండకపోవచ్చు. కాని నేను రైల్వేల మంత్రి నవటం వల్ల, స్థూలదృష్టికి గోచరంగాని నైతిక బాధ్యత నాకు వున్నది. అదే నాచేత ఈ రాజీనామా యిప్పిస్తున్నది' అన్నారు శాస్త్రి. కేంద్ర మంత్రి వర్గం నుంచి బయటికి వస్తూ మంత్రి పదవి కోసం తపస్సులుచేస్తూ, కనిపించిన దేవుళ్ళందరికీమొక్కే రోజులలో, నైతిక ధర్మాచరణ కోసం అది వొదులుకు రాగలిగిన ఈ ధీరపురుషుడు భారత జనని నోములపంట.

రాజీనామా యిచ్చి వచ్చాక. ప్రభుత్వం వారి కారులో యింటికి వెళ్ళమంటే, 'ఇప్పుడు నేను మంత్రిని కాను - ఈ కారులో ఎలా వెళ్ళను?' అని బస్సుమీద యింటకి వెళ్ళారట- స్వంతకారూ, స్వగృహమూలేని కేంద్ర మంత్రి ఈయనొక్కరే!

తాష్కెంట్ పత్రం, భారత ఉప ఖండంలో శాంతి సౌభాగ్యాలనీ, నెలకొనాలనీ, ఈ ఉపఖండంలోని ప్రజలు స్వల్ప వివాదాలకోసం తమ శక్తి సంపదలు వృథా చేయక, నదీజలాలూ పంటపొలాలూ తమ అభి వృద్ధికీ ఐశ్వర్యానికీ తోడ్పడేటట్లు కష్టిచేసి సామాన్యుల జీవితాలు మెరుగు పరచాలనీ చాటుతోంది. అమెరికా రష్యాలు రెండూ ఈ పత్రంలోని ఆశ యాలు నిజాలై వర్ధిల్లాలని కోరుతు న్నాయి. పంపకాలు అయాక కూడా అన్నదమ్ముల మధ్య సహనమూ సామ రస్యమూ ఏర్పడక పోవడానికి చింతిల్లి, శాంతి పథమే జనప్రగతికి సోపానమని తాష్కెంట్‌లో ఉద్ఘాటించిన కర్మ వీరుడు శాస్త్రిజీ. అరు దశాబ్దాల క్రితం మొగల్‌షరాయ్‌లో ఒక పేద ఆధ్యా పకుని యింట జన్మించిన బాలునికి 'నీవు యింత వాడవుతావు, నాయనా' అని ఎవరూ జోస్యం చెప్పివుండరు.

తాష్కెంట్‌పత్రమే శాంతి కపోతం.

— సంపాదకీయం

'జగతి' - ఫిబ్రవరి 1966

గాంధీజీ దృక్పథంలో

# వ్యక్తి ప్రభుత్వం

గాంధీగారెప్పుడూ ఎవరైనా హక్కుల గురించి మాట్లాడితే - అక్కడ ఆగు - అనేవారు. 'నీ విధులు నిర్వర్తించి, నీ బాధ్యతలు నెరవేర్చినమీదట - హక్కులు వాటంతటవే నీకు సంక్రమిస్తాయి. నెత్తీ నోరూ పెట్టుకు అరచినంతమాత్రాన హక్కులు రావు. హక్కులెప్పుడూ విధులువల్ల, బాధ్యతలవల్ల పరిరక్షింపబడుతున్నాయి' - అనేవారు. ఇది నా హక్కు అని దర్పంగా చెప్పుకునే వారికి, ఈ మాదిరి హితవులు రుచించకపోవచ్చు.

వయోజన స్వాతంత్ర్యము యింకా కను చూపు మేరలో లేని కాలములో ప్రధాని బాల్డ్విన్ ఒకచోట అంటాడు: 'డెమొక్రసీలో లోటుపాట్లు లేవని కాదు, కాని ఇంతకు మించిన ఉత్తమ పాలనా వ్యవస్థ మరొకటి కనబడటం లేదు. ప్రజాస్వామ్యములో ప్రజలందరూ కష్టపడి పని చేస్తారు' అని. ఇందుకు గాంధీగారు యీ మాటలు చేరుస్తారు. 'మనలోని నిజాయితీ, నిశ్చలచిత్తమూ, మనోబలమూ, ఆత్మస్థయిర్యమూ, శ్రద్ధ, శిక్షణ వీటి మీదనే మన భవిష్యత్తు ఆధారపడి వుంటున్నది' అంటారు బాపూజీ. బాల్డ్విన్ పొడి మాటలతో చెప్పిన దానిని, బాపూజీ తమ సునిశిత శైలితో వివరించి చెబుతూ, ప్రజలందరూ అని అనుకోవడము కాదు - ఎవరికి వారు తమకి తాముగా కృషిచేయాలంటారు. గాంధీగారు ఏవీకూడా కనపడని వ్యవస్థకు అంటగట్టక, కనిపించే వ్యక్తులపై భారము మోపేవారు.

వ్యక్తులు, వ్యక్తిత్వము అనేవి మనం పాశ్చాత్య భావవాహిని నుంచి గ్రహించినవి. వ్యక్తత తెలియడమనగా ఒక వయసు వచ్చి, మంచి చెడ్డలు తెలుసుకోవడంగా భావించేవారు. ఆ వ్యక్తతకీ, యీనాడు మనము వాడే వ్యక్తిత్వానికీ ఏమీ సంబంధము లేదు. వ్యక్తిత్వమనగా కొంత వైలక్షణ్యమూ ప్రత్యేకత వుండాలి. పౌరులందరూ వ్యక్తులుగా, అనగా విలక్షణ వ్యక్తిత్వము గల మనుషులుగా భాసించలేక పోవచ్చు - కాని, ప్రతిపౌరునికీ వ్యక్తిత్వ సాధన ఆశయమై వుండాలి. ఈ ఆశయమే లేనినాడు, మనిషికి పెరుగుదల వుండదు. సామాన్యపౌరుడు తనపౌర

బాధ్యతలు నెరవేర్చడము ద్వారా ఉత్తమ పౌరుడవుతున్నాడు. ఈ బాధ్యతా నిర్వహణ, యాంత్రిక మైనది కాదనీ, చైతన్యవంతమైనదనీ, దానికి యాంత్రిక లక్షణమబ్బినప్పుడు బ్రతుకులు నిస్సారములవుతాయనీ గాంధీజీ హెచ్చరిక చెబుతున్నారు.

మానవుడు సంఘజీవి. అది మనం దరికీ తెలిసిన విషయమే. ఈ మానవునిలో రెండు లక్షణాలు వున్నాయి. తన చుట్టూ వున్న సంఘాన్ని యధాతధంగా చిత్రించడము ఒక లక్షణం– ఇది ఎలా వుంటే బావుంటుందో కలలు గనడము మరొక లక్షణం. ఈ రెండు లక్షణాల వల్లనే విధినిషేధాలతో కూడిన సాంఘిక వ్యవస్థను ఆదర్శవంతముగా చేయాలనే ప్రయత్నంలో, దాని రక్షణ నిమిత్తము సూత్రాలూ నియమాలూ సృష్టింపబడ్డాయి. కొందరు రాజూ దేవుడూ ఒకరేనని అంటే, మరికొందరు రాజునీ దేవుణ్ణీ విడగొట్టి, మీ ఆస్తి పాస్తులు రాజువి కాని, అధ్యాత్మిక సంపద దేవునిది - అన్నారు. ఈ దేవుడు అనేక దేవతా రూపాలు దాల్చడంతో, ఏథెన్సు నగరములోని గ్రీకులు, 'మా వ్యవహారాలు మేము స్వయముగా చూసుకుంటాము, నగరాధిపతి- అయన గారినిటైరంట్ అనేవారు – ఆ టైరంట్ చూడనవసరము లేద' న్నారు. ప్రజలు తమ వ్యవహారాలు స్వయంగా చూసుకోవడమే డెమొక్రసీ- డెమోస్ అనగా గ్రీకుభాషలో ప్రజలు అని అర్థము.

ఏథెన్సులో డెమొక్రసీ నిలిచినది కొద్దికాలమే అయినప్పటికీ, పరిపాలనా వ్యవహారాలలో ప్రజావాణి వినిపించాలనే సంకల్పాన్ని గ్రీకులు శత విధాల కనబరిచారు. అనాటి ఏథెన్సులో బానిసలు లేరనుకోవద్దు - అధిక సంఖ్యలో వుండేవారు. ప్రజలు అనగా గ్రీకుల ఉద్దేశం స్వజాతీయులైన పౌరులని. బానిసలు లేని నాగరికత అసంభవమని ప్లాటో భావించడమూ, మెసడోనియా నుంచి సింధు నది వరకూ వచ్చి యిక జయించ గల భూమండలం లేదని అలెగ్జాండర్ వాపోవడమూ - అదంతా వేరే కథ.

క్రీస్తుకి నాలుగైదు శతాబ్దుల క్రితం భారత భూమిలో గౌతమబుద్ధునిగా, చైనాలో కన్‌ఫ్యూజియస్‌గా పాశ్చాత్య సీమలో ప్రజాస్వామ్య పాలనావిధానముగా అంకురించిన ఈ భావసౌగంధికము, కాలగతితో మరుగునపడి, అంధ యుగం దాటి, మధ్యయుగం నాటి రినైజాన్స్ అనంతరము, ఫ్రెంచి విప్లవముగా, ఆ తర్వాత అమెరికన్ విప్లవముగా మానవుని ప్రాథమిక హక్కులని ఉద్ఘాటించింది.

గాంధీగా రెప్పుడూ - ఎవరైనా హక్కుల గురించి మాట్లాడితే-అక్కడ ఆగు - అనేవారు. నీ విధులు నిర్వర్తించి, నీ బాధ్యతలు నెరవేర్చిన మీదట - హక్కులు వాటంతటవే నీకు సంక్రమిస్తాయి. నెత్తీ నోరూ పెట్టుకు అరిచినంతమాత్రాన హక్కులు

రావు. హక్కులెప్పుడూ విధుల వల్ల, బాధ్యతల వల్ల ప రి ర క్షిం ప బ డు తున్నాయి - అనేవారు. ఇది నా హక్కు - అని దర్పంగా చెప్పుకునే వారికి, ఈ మాదిరి హితువులు రుచిం చక పోవచ్చు. కాని, గాంధీగారి సిద్ధాంతాలని లోకము హర్షించి, ఆమో దించేందుకు యింకా కొన్ని శతాబ్దులు పట్టవచ్చు.

మంచివిత్తనం మహావృక్షమైనట్లు వేళ్ళూ కాండమూ ఏపుగా ఎదిగిన మీదటనే చెట్టు అయినా శాఖోప శాఖలుగా విస్తరిల్లి ఫలపుష్పాదుల నిస్తుంది. వేళ్ళనిబట్టే వృక్షము. ప్రజాస్వామ్యం కూడా ఆ విధముగా ఎదగాలంటారు గాంధీజీ పైనుంచి దిగువకి విరజిమ్మడముగాక, కింద నుంచి పైకి విస్తరిల్లాలి. అహింసా సిద్ధాంతం ప్రకారం ఆయన దృష్టిలో మార్గమూ గమ్యమూ ఒకటే - ఎండ్స్ అండ్ మీన్స్ ఒకటే. ఎంతటి పవిత్ర లక్ష్యమైనప్పటికీ ఆ లక్ష్య సాధనకు అవలంబించే మార్గముకూడా నిరాక్షేపణీయమై వుండాలి. పాశ్చాత్య లోకములో లక్ష్యమే ప్రధానంగాని మార్గమంత పరిగణింపదగ్గది కాదు. విజయము ఏ మార్గాన లభ్యమైనా, అది ప్రశంసింపబడుతుంది. ఉపాయాలూ, యుక్తిమార్గమూ, పెడ దారులూ యివన్నీ, లక్ష్యము ఉత్తమ మైన దైనప్పుడు, క్షంతవ్యములని భావిస్తారు. లౌకికముగా అది సమ ర్థనీయము కావచ్చునేమోగాని గాంధీజీదినైతికదృక్పథము. అహింసా వాదికి మార్గమూ లక్ష్యమూ ఒకటే ననీ, ఒకదానినుంచి ఒకటి విడదీయ డానికి వీలులేనిదనీ, లక్ష్యసాధనలో ఎటువంటి దౌర్జన్యంవున్నప్పటికీ అది లక్ష్యాన్ని అపవిత్రము చేస్తుందనీ ఆయన సిద్ధాంతము. గాంధీగారి దృష్టిలో ఏది హింస - ఏది అహింసా అనేది బోధపరుచుకునేందుకు సామాన్యులకు కొంచెము కష్టముగానే వుంటుంది. మరణవేదనతో బాధ పడుతున్న గోవుని తుపాకీ గుండుతో కాల్చేందుకు అనుమతి యిచ్చి, దాని మరణము అనివార్యమని వైద్యుడు చెప్పాడు గనక, ఆ ప్రాణికి బాధనుంచి విముక్తి కలిగించడము హింస కాదన్నారు. అలాగే జంతువులని మృగయావినోదం కోసము వేటాడటం హింస అనీ, క్షుద్బాధ తీర్చుకునేందుకు జంతువుని చంపడము హింస కాదనీ అన్నారు. శాసనోల్లంఘనము, అనగా సివిల్ డిజొబీడియన్స్ - క్రమానుగతంగా, దౌర్జన్యరహితముగా, ఎదుట వారికి తమ అసమ్మతిని సూచన ప్రాయంగా తెలిపేటట్లు జరుగుతుంది కనక అహింస, శాసనధిక్కారము - అనగా క్రిమినల్ డిజొబీడియన్స్, క్రమరహితముగా, దౌర్జన్య పూరిత ముగా ఎదుటవారికి తమ అసమ్మతిని, ఆగ్రహావేశముతో తెలిపేటట్లు జరుగు తుంది గనక హింస - అన్నారు.

మన సంస్కృతికి పురుషులు సత్పురుషులు, పూర్ణపురుషులు, కాపురుషులు - ఈ మాదిరిగానే తెలుసు. పౌరసత్వము, వ్యక్తివికాసము -



"Rama killed that sleeping demon Kumbhakarna and that ten-headed Lankeswara, Ravana. The rest were finished off by others. Am I correct, Father ?"

"No, Raghu. Not just two but three. Rama killed Ravana's adopted son as well."

"Besides his own two sons, did he adopt another ?"

"Yes, his name was Makaraksha, the son of Khara who died earlier defending the outer fortress of Ravana. Makaraksha grew up in Ravana's household as his adopted son and acquired all the skills of war. He turned out to be a great warrior almost like Ravana. When Kumbhakarna and Indrajit fell, Ravana had a premonition of his approaching end. He never wanted this adopted son Makaraksha to create any trouble in respect of succession to the throne after his death. So, he cleverly despatched him to the battlefield to be slain by Rama. Thereafter, of course, you know that Ravana paid with his life for the misdeeds he had done."



*Swadharma Swaarajya Sangha*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*
*(Ph. 514477)*



యిటువంటివి కొత్తగా వీచిన గాలులు. ప్రతి మనిషిలోనూ విశ్వాసానికి చెందిన భాగము మతపరము గానూ, హేతువుకి చెందిన భాగము విజ్ఞాన పరముగానూ ఉంటుంది. సంఘ జీవనగతిలో మతమూ, విజ్ఞానమూ, వ్యక్తిజీవన పరిణతిలో విశ్వాసమూ హేతువూ - నిరంతరమూ - ఘర్షణ పడుతూ వుంటాయి. పాశ్చాత్య ప్రపంచములోని మేధావులు ఈ ఘర్షణ, చైతన్యకారకమని, అది సర్వ సహజంగా వుంటుందనీ అన్నారు. గాంధీగారు వొప్పుకోలేదు. వైజ్ఞానిక దృక్పథము మతవిశ్వాసాన్ని మరింత బలపరుస్తుందన్నారు. తల్లి తన పిల్లవానికి ఏవిధముగా సేవచేస్తుందో, అదే విధముగా సత్యాగ్రహి స్వలాభమనేది లేకుండా దేశానికీ, జాతికీ నిస్వార్థ సేవ చేయగలడంటారు.

ఆదర్శసామ్యవాద పాలన అనేది స్థిరపడినమీదట జరుగుతుందంటాడు కారల్ మార్క్స్ - అనగా అప్పుడు ప్రభుత్వము తన న్యాయదండంతో ప్రజలను పాలించవలసిన అవసరం వుండదు. అంతవరకు వివిధ వర్గాల మధ్య వైరుధ్యము తప్పదనీ, వర్గరాహిత్య సమాజస్థాపనతో గాని ప్రభుత్వం రద్దయే శుభదినము అవతరించదనీ కమ్యూనిష్టులు అంటారు. సంఘాన్ని కొన్ని వర్గాలుగా విభజించి, పైవర్గాలు కిందవర్గాలని పీడించుకు తింటున్నాయనే దృక్పథము గాంధీగారు సుతరామూ వొప్పుకోరు. 'మనకంతగా పరిచయం లేని దేశాల్లో అటువంటిది జరుగుతున్నదేమోగాని భారతదేశానికి సంబంధించినంతవరకూ అది వాస్తవము కాదు. తిరువనంతపురం సంస్థానము తిరువాన్కూర్ రాజుది కాదు, అనంత పద్మనాభ స్వామిది. ఆ స్వామి తరపున రాజాగారు ధర్మకర్త. ధనవంతులు తమ సిరిసంపదలకు ధర్మకర్తలు. వారిని ద్వేషించడంలో హింసా ప్రవృత్తియే తప్ప విజ్ఞానముగాని, వివేకముగాని లేదు' అంటారు గాంధీజీ. ప్రతి మనిషికీ ఆర్థిక, సాంఘిక, నైతిక బాంధవ్యాలూ బాధ్యతలూ వున్నాయి. మొదటి రెండూ ఆధిభౌతికానికి చెందినవి. నైతిక జీవనము ఆధ్యాత్మిక చింతనకు చెందినది. కాని ఈ మూడూ ఒకదానికొకటి పెనవేసుకునున్నాయి. ఆర్థిక సాంఘిక ప్రగతి రాజకీయాలతో ముడిపడి వుంది. రాజకీయాలనగా పాలనాయంత్రం. నేడు మనది యంత్ర నాగరికత గనక ఈ పాలనా యంత్రము కూడా అన్ని యంత్రాలకివలె చలనమే తప్ప జీవ స్పందన లేని వ్యూహము. అంచేత, ప్రభుత్వము ప్రజల నిత్య జీవితంలో ఎంత తక్కువ మేర జోక్యము కలిగించుకుంటే, ప్రజలు అంత సుఖపడతారు. కాని, అది మాటలలో అనుకొనేటంత తేలికైనది కాదు.

పారిశ్రామిక సంపద పెరిగిన కొద్దీ ప్రజల దైనందిన జీవితంలో ప్రభుత్వ ప్రమేయం కూడా పెరుగుతుంది. నేటి భారీ పరిశ్రమలు ధనవంతులొక్కరి వల్లా అయేపని కాదు, వాటికి

ప్రభుత్వము వారి అభయ హస్తము వుండాలి. తను అభయం యిచ్చినప్పుడు ప్రభుత్వము, తన పరువు ప్రతిష్టలు కాపాడు కొనక తప్పదు. తత్కారణ ముగా ప్రజల పై కొంత వొత్తిడీ తప్పదు.

పాలనా యంత్రము ప్రజలకిచ్చే వొత్తిడి ఎప్పుడూ పరోక్షంగా ఉంటుంది - ప్రత్యక్షంగా ఏమీ కన బడదు. గాంధీగారికి యంత్రాలంటే కోపము అనుకునేవారు యిప్పటికీ వున్నారు-కాని అది నిజంకాదు. ఆయన విచారము యంత్రానికి మనిషి బానిసై పోతున్నాడని. ఈ బానిసని పాలనా యంత్రము మరింత క్రూరముగా నలిపి వేస్తుందని బాధపడేవారు. ఆధునికు లలో కొందరు మానవదేహాన్ని యంత్ర ముతో పోలుస్తారు. వారి దృష్టిలో సంఘము, మనిషి కంటె పెద్ద యంత్రము, ప్రభుత్వము సంఘము కంటె యింకా పెద్ద యంత్రము. ఈ యంత్ర సంబంధమగు భావన, మానవ చైతన్యముపై దాడిచేసి,హస్తకౌశలాన్ని బుద్ధిబలాన్ని హరించి, మనిషిని జడునిగా చేస్తోంది. ఘన యంత్రాల నిర్మాణ కృషియే మహోన్నత లక్ష్యంగా భావించే పాలనా యంత్రానికి సహస్ర విధాల సహాయపడే కోటానుకోట్ల స్త్రీ పురుషులు, యాంత్రిక వలయంలో జీవించడము తప్ప, తాము మను షులమనే సంగతి మర్చిపోతున్నారు - అంటారు గాంధీజీ.

గంటకి నలభై మైళ్ళ వేగాన పోతున్న కారులో కూచుని, యిది యింత కంటె వేగముగా పోదా? - అని అడిగే గాంధీజీకి యంత్రాల మీద ఆగ్రహ మేనాడూ లేదు. యంత్రానికి అమ్ముడు పోయిన మనిషి, ముందు ముందు ప్రభుత్వరథాన్ని ప్రాచీన లోకపు బానిస వలె లాగవలసి వస్తుందని విచారించే వారు.

ఏమాత్రము అలుసిచ్చినా ప్రభుత్వము, ప్రజలని పన్నుల రూపాన మొట్టు తూ వుంటుంది. అంచేత ప్రజలు నిత్య చైతన్యవంతులై, ఏది ఎందుకు ఏవిధముగా జరుగుతున్నదో తెలుసు కుంటూ వుంటే తప్ప, ప్రభుత్వ యం త్రాంగము వీరిని తొలాయించేందుకు ప్రయత్నిస్తుంది. అయిదు సంవత్సరాల కొకసారి ప్రతినిధులని ఎన్నుకొని, వారిని హైదరాబాదో, ఢిల్లీయో పంపి, ఆ ఎన్నికల నినాదాల మధ్య ప్రజా స్వామ్యమనే మాట పదిసార్లు పలికినంత మాత్రాన మన బాధ్యత తీరిపోదు. మన ప్రతినిధి, మన వాళ్ళబ్బాయికి కాలేజీ లో సీటు యిప్పించేందుకూ, కొత్త కాఫీ హొటల్ కి ప్రారంభోత్సవము జరిపేం దుకూ మాత్రమే గాక, తను ప్రాతి నిధ్యము వహిస్తున్న ప్రజలకీ, పాలనా యంత్రానికీ మధ్య తులామానము ఎలా పుచ్చుకున్నాడన్నదే ముఖ్యము. అమా యకులైన ప్రజలకు రాజనీతి వ్యవహా రాలు తెలియక పోవచ్చు. కాని, యిందరి తరఫున ప్రాతినిధ్యము వహించే వ్యక్తికైనా చిత్తశుద్ధి, స్థిరసం కల్పము, ప్రజాహితచింతన, సేవా ధర్మము వుండాలనీ ఒక జీవిత కాలపు సత్యాన్వేషణలో తను జరిపిన ప్రయో

గాలని అవగతము చేసుకొన్న సత్యాగ్రహి అయి వుండాలనీ భావించారు గాంధీ.

మనది పార్లమెంట డెమొక్రసీ- అనగా పార్లమెంటు ఉభయ సభలలో గల ప్రతినిధులనిర్ణయమే ప్రజానిర్ణయం. ప్రజాస్వామ్యమనగా ప్రజలచేత, ప్రజల కోసము నిర్వహింపబడే ప్రజా ప్రభుత్వము. గవర్నమెంట్ అఫ్ ది పీపుల్, బై ది పీపుల్, ఫర్ ది పీపుల్. ఈ మధ్య కమ్యూనిష్టు ప్రభుత్వాలు తమవి పీపుల్స్ డెమొక్రసీస్ అంటున్నాయి. సిసలైన ప్రజాస్వామ్య విధానములో విప్లవానికి ఆస్కారము లేదు. విప్లవ లక్ష్యాన్ని పరిణామ పథములో అందుకో గలుగుతుంది ప్రజాస్వామ్య పద్ధతి. ఇటు జపాన్‌లోనూ అటు యింగ్లాండు లోనూ ఎంతటి అభ్యుదయ భావ పరంపర వ్యాప్తి చెందినా, రాజకుటుం బాలని అక్కడి ప్రజలు ఎంతో భక్తి ప్రపత్తులతో గౌరవిస్తున్నారూ అంటే, ప్రజాస్వామ్య విధానములో గల అహింసా మార్గము వెల్లడవుతోంది. పాశ్చాత్యలోకములోని పాలనా వ్యవస్థను అనుకరించినంత మాత్రాన చాలదనీ, అది భారత దేశములో స్థిరముగా నిలదొక్కుకునేందుకు స్వార్థ రహితులైన సత్యాగ్రహ వీరులు కావాలనీ అన్నారు గాంధీజీ. ఈ సత్యాగ్రహదీక్షాపరులే సామాన్య ప్రజానీకాన్ని కబంధ హస్తాలనుంచి కాపాడ గలుగుతారు.

భారత రాజకీయాకాశము పై గాంధీజీ ధృవతారగా ప్రకాశించడానికి యింకాయిరవైయేళ్ళ ముందు, ప్రొఫెసర్ గిల్బర్ట్ ముర్రే అన్నాడు: 'ఏ ప్రలోభాలూ లేని ఈ మనిషి విషయమై జాగ్రత్తగా వుండాలి. పొగడ్తలూ, పలుకుబడీ,సంపదలూ,సదుపాయాలూ ఈయనని తను గీసుకున్న బాటనుంచి తప్పించలేవు. ఆయన ఆత్మ బలం అజేయము.'

ప్రేమ,అహింస - యీ రెండూసత్యాగ్రహమనే నాణెమునకు చెరోవైపుగా భావించిన గాంధీజీ, యాంత్రిక స్వభావముగల ప్రభుత్వం, దౌర్జన్య మార్గాన పడకుండా ప్రజలు అహింసావాదులై తమ చైతన్య దీప్తితో దానిని అదుపులో వుంచాలన్నారు. అదే ప్రజాధర్మము, అదే ప్రజాస్వామ్యము.

—యన్నార్ చందూర్
'ఆకాశవాణి' ప్రసంగం
'జగతి' - అక్టోబరు 1966





అహంవల్ల ఏర్పడే అంధకారం, అసలు చీకటికంటె కడుదట్టమైనది.

వ్యక్తిలో గల ఔన్నత్యం మేథస్సులో గాక హృదయంలో ఉంటున్నది.

మానవత్వ మెప్పుడూ హృదయంలోని మెత్తదనంలా వ్యక్తమవుతుంది.

అహింస పూర్తిగా అనుసరణీయమైనప్పుడు, ద్వేషం దానంతటదే మాయమవుతుంది.

—గాంధీజీ సూక్తులు

1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్యపత్రం



"ఆసియా, ఆఫ్రికా ఖండాలనుంచి స్వాతంత్ర్యమనేది ఏనాడో మాయమయింది. యూరప్‌లోని ప్రజలుకూడా స్వేచ్ఛా వాయువులని మర్చిపోయారు. ఆ పవిత్రజ్యోతిని తిరిగీ వెలిగించ గల సమర్థత, సాహసమూ ఈ నూతన ఖండానికి మాత్రమే ఉన్నాయి. స్వాతంత్ర్య లక్ష్యంగల ప్రతివ్యక్తికీ ఈ ఖండమే ఒక ఆశాదీపం. వలసలు ధైర్యంతో ముందంజవేసి, ప్రజానీకంపై సామ్రాజ్య శక్తులు జరిపే దారుణ హింసాకాండని ఎదుర్కొన వలసివుంది" - అన్నాడు టామ్ పెయిన్ 1776లో 'కామన్ సెన్స్' అనే కరపత్రంలో.

ప్రత్యూషవేళ ప్రతినిధులలో సంచలనం కలిగింది కొందరు సంశయాత్మకంగా వున్నారు నిషేధింపబడిన మొదటి పార్లమెంటులో తమ సమయోచిత పాత్ర నిర్వహించేందుకు ఎవరికి వారు సంసిద్ధులౌతున్నారు. ఫిలడల్ఫియాకి నూరుమైళ్ళ దూరంలో శత్రుసేనలు దిగుతున్నప్పుడు ఈ క్లిష్టసమస్యా పరిష్కారాన్ని వాయిదా వేయడానికి ఇక వీలుపడదు. జూలై 1వ తేదీ సోమవారం వుదయం తాము తొక్కేబాట, చావుబ్రతుకులను నిర్ణయిస్తుంది. ఈ నూతన ఖండపు ముందు తరాలవారి ఘటనాచక్రాన్ని మార్చివేస్తుంది.

సప్తమశ్రేణి, మార్కెట్‌వీధీ కలిసే మూల, ఒక తాపీమనిషి ఇంట్లో అద్దెకున్న ఆరడుగుల వ్యక్తి అలవాటు ప్రకారం ఐదుగంటలకు లేచాడు. వర్జీనియారాష్ట్రపు నీలి కొండలలో పెరిగిన ఈ న్యాయవాది వయసు ముప్పైమూడు. ఖడ్గీలాటి ఆ యువకుడు సంధించిన బాణం వలె దూసుకుపోగలడు. వీరవరుని దేహసౌష్టవమూ, ఉత్తమ కులసంజాతుని ముఖతేజమూ జఫర్‌సన్‌లో కనిపిస్తాయి.

ఈ వుదయం అతను తన పడకగదిలో నుంచి వరండాలోని వ్రాతబల్ల వద్దకు వచ్చి చందూకాపెట్టె తెరిచాడు. సమావేశానికి పూర్వం కొన్ని లేఖలు వ్రాయాలి. ఈపూటైనా మాంటిసెల్లో నుంచి ఉత్తరం వస్తుందేమో ననుకుంటున్నాడు. భార్య వద్దనుంచి ఉత్తరం వచ్చి రెండువారాలైంది. తను

బయలుదేరేటప్పటికి ఆమెకు కొంచెం నలతగా వుంది. కిటికి వద్దకు వచ్చి రెండు రెక్కలూ తెరిచి ఒకసారి దీర్ఘంగా గాలి పీల్చాడు. చుట్టూగల గృహాంగణాల నుంచి కాకులు కావు కావు మంటున్నాయి. సుపరిచితమైన ఎర్రగోపురం గల ప్రభుత్వ భవనం ఇంటికప్పుల మీదుగానూ, పుప్పవాటికల మీదుగాను, దక్షిణాన రెండు వీధులకవతల కనబడుతోంది. ఆ గోపురానికి దూరంగా ఆగ్నేయ దిక్కులో కొంచెం వొంపు దిరిగిన డెలవార్ నది, జెర్సీ తీరాన రకరకాల నౌకల తెరచాపలూ కన్పిస్తున్నాయి. పశ్చిమాన నల్లరేగడిభూమి పర్వతాలలో కలసిపోతూ అటవీ ప్రదేశమై, చూపు అందే వరకూ ఆకుపచ్చరంగు పరుచుకుంది. యూరప్ నుంచి బహిష్కృతులైన పేదవారి (క్వేకర్స్) ని మిత్రం విలియమ్ పెన్ ఈ పట్టణాన్ని మూడు తరాల క్రితం నిర్మించాడు. ఆ పేదవారి పట్నం ఈనాడు నూతన ఖండానికంతకు సువిశాలమూ భాగ్యవంతమూ అయిన నగరంగా రూపొందింది.

ఆలోచనా ముద్రతో ఆ వర్జీనియా ప్రతినిధి తన వ్రాతబల్ల చేరుకున్నాడు. పోయిన నెల్లాళ్లుగా చెస్ట్‌నట్ వీధి సమావేశాలు అలజడితో సాగుతున్నాయి. తను ఏదోవిధంగా వ్యవధి చిక్కించుకొని అనేక నివేదికలూ, పత్రాలూ తయారు చేశాడు. వాటిలో స్వాతంత్ర్య పత్రం చిత్తు ప్రతి ఒకటి. అయిదుగురు సభ్యులుగల ఒక కమిటీ జూన్ పదకొండవ తేదీన, ఈ పత్రరచనా భారం జఫర్‌సన్‌కి వొప్పగించింది. ఇది తన వల్ల కాదేమోనని జఫర్సన్ మొదట్లో సంశయించాడు, కాని ప్రథమ తీర్మానాన్ని ప్రవేశపెట్టిన రిచర్డ్ హెన్రీ లీ అవసర కార్యంపై వర్జీనియా వెళ్ళి వుండటంచేత, జాన్ యాడమ్స్, స్వాతంత్ర్యపత్ర రచనా గౌరవం జఫర్‌సన్‌కే దక్కాలని పట్టుబట్టాడు.

జఫర్‌సన్ ఇది తన తలకు మించిన భారమని వాపోయాడు. "ఇది మీరు చేయవలసిన పని, మిస్టర్ యాడమ్స్, మీ వంటి అనుభవజ్ఞులు ఇటువంటి పనికి పూనుకోవాలి."

నిశితదృష్టిగల జాన్ యాడమ్స్ కృత నిశ్చయంతో అన్నాడు: "నేను గాదు ఆ ప్రతిని రూపొందించవలసిన భారమూ, బాధ్యతా మీది"

"ఇంత పట్టుపట్టడానికి కారణం"?

"మొదటి కారణం: మీది వర్జీనియా రాష్ట్రం. వర్జీనియా వాసి ఈ కార్య క్రమానుష్ఠానికి అధ్యక్ష స్థానంలో వుండాలి. రెండవ కారణం: నా మీద అందరికీ పూర్తి విశ్వాసము లేదు. అనేకులు నన్ను అనుమానాస్పదముగా చూస్తారు. మీ కున్న గౌరవ ప్రతిష్ఠలూ పేరు ప్రఖ్యాతులూ నాకు లేవు. మూడవ కారణం: మీరు నాకంటె పదిరెట్లు ఉత్తమంగా రచించగలరు."

జూన్ నెల మూడవ వారానికి జఫర్‌సన్ ఒక చిత్తు ప్రతిని తయారు చేశాడు. పోయిన శుక్రవారమే దానిని కాంగ్రెస్‌కి అందచేశాడు. జులై 1వ



తేదీ సోమవారం నాడు అది చర్చకు ప్రవేశపెట్టబడుతుంది. ప్రతినిధులు మొట్టమొదట హెన్రీ లీ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని చర్చిస్తారు. దానిని గాని సభవారు ఆమోదిస్తే, స్వాతంత్ర్య పత్రాన్ని క్లాజువారీగా పరిశీలిస్తారు. మానిఫెస్టో తయారు చేయడంలో జఫర్‌సన్, ఆయుధబలం ఏ మాత్రం లేని ప్రజలు, అత్యధిక బల సంపన్నమగు ఒక సామ్రాజ్య శక్తిని ఎదుర్కొనవలసిన అగత్యం ఎందువల్ల ఏర్పడినదో, సహేతుకంగా చూపించాడు. ఆ కారణాలను వివరాలతో విడమరిచి చెప్పాడు. దీనిని మానవ జీవన స్వాతంత్ర్య పత్రంగా, సమస్త మానవాళికీ చెందవలసిన ప్రాథమిక

స్వాతంత్ర్య లక్ష్యంగా ప్రపంచమనే ఒక పెద్ద అద్దంలో అమెరికనుల మనసుని ప్రతిబింబింపజేసి, ఇది మా మనసు మాత్రమే కాదు, మానవుని మనోభావమూ మనోగతమూ ఇవే సుమా - అని సభ్యమానవాళి ముందు వుంచాడు.

తను రూపొందించిన ప్రతి, అందరి అనుమతిని పొందగలదా ? కాంగ్రెస్ ప్రతినిధులు జూన్ 7 వ తేదీ నుంచి స్వాతంత్ర్య తీర్మానం విషయంలో రెండుగా చీలిపోయి వున్నారు. ఇటువంటి దుడుకు తీర్మానం కొందరికి భయ కారణమయింది. పెన్సిల్వేనియా క్వాకర్ న్యాయవాది జాన్ డికెన్‌సన్ నాయకత్వాన, మధ్య అమెరికాలోని నాలుగువలసలలోని ప్రతినిధులూ - మితవాద వైఖరి నవలంబిస్తూ, తీవ్రవాదులైన న్యూయింగ్లండు, వర్జీనియా ప్రతినిధులతో విడిపోయేందుకు సిద్ధంగా వున్నారు. మాతృదేశం నుంచి, యీ వలస రాజ్యానికి సంధి షరతులు మాట్లాడే నిమిత్తం రాయబారులు వస్తున్నారనీ, వారు మార్గమధ్యంలో వున్నారనీ, యిటువంటి సమయంలో దేశాన్ని అంతర్యుద్ధంలోకి దించడం క్షేమదాయకం కాదనీ, గౌరవ ప్రదమైన సంధి జరిపేందుకూ శాంతిని నిలబెట్టేందుకూ అవకాశమున్నపుడు ఎందుకీ తొందరబాటనీ కొందరి ప్రశ్న.

సూర్యకిరణాలు డాబాపై పరుచుకుంటున్న ఉదయపు వేళ, తన కుటుంబం ఫలహారం తీసుకొంటుండగా, తను మాత్రం పఠనామందిరంలో కూచుని, తన వ్యాఖ్యలకు చివరి మెరుగులుదిద్దుకుంటున్నాడు డికెన్సన్. ఆ చుట్టుపట్ల కంతకీ డికెన్సన్‌భవనం, ఫెయిర్ హిల్, ఘనంగా చెప్పుకోదగ్గది. అంత సువిశాలమూ, సుందరవంతమూ అగు భవనము ఆ ప్రాంతాల లేదని ప్రతీతి. తాపీ మనిషి అద్దె కిచ్చిన వాటాలో జఫర్‌సన్ స్వాతంత్ర్య పత్రానికి రూపుదిద్దగా, ఇక్కడ ఈ విశాలభవంతిలో కూచుని ఆక్షేపణల పట్టికను తయారు చేస్తున్నాడు డెకెన్సన్.

కాంగ్రెస్ సభలో డాక్టర్ ఫ్రాంక్లిన్ తరువాతఅంత పలుకుబడి, పేరుప్రఖ్యాతులూ గల వ్యక్తి డికెన్సన్ ఒక్కడే. వలస దేశానికి గల స్పర్ధలు, కలహాలు ఓర్పుతోను హేతు మార్గంగాను పరిష్కరించాలే తప్ప దౌర్జన్యం క్షేమకరం కాదని ఈయన వాదన. కాంగ్రెస్‌లో చాలామంది ప్రారంభం నుంచీ ఈయనను సమర్థిస్తున్నారు. కాని ఈ మధ్య కొన్ని నెలలుగా స్వాతంత్ర్యోపాసకులైన న్యూఇంగ్లండు వారు నెమ్మది నెమ్మదిగా పలుకుబడి పుంజుకుంటూ, ఇతని నాయకత్వాన్ని భంగపరుస్తున్నారు. అంగ్లరాజుకి పంపుతున్న ఆఖరు విన్నపం అంత ప్రాధేయకరమగు భాషలో వుండడానికి వీరు అభ్యంతరం తెలిపారు. జరిగిన తీవ్ర చర్చలో జాన్ యాడమ్స్, తను ఆ విన్నపం పంపడానికి ఎందుకు అభ్యంతరం తెలుపుతున్నదీ వివరించాడు. 'వెనకటి విన్న

పాలని రాజు విస్మరించాడు. వాటిని బుట్టదాఖలు చేశాడు. బ్రిటిష్ పార్లమెంట్ తమ విన్నపాలని కనీసం పరిశీలించేందుకు కూడా అనుమతించలేదు. ఈ ప్రసక్తి రాగానే వ్యతిరేకంగా వోటుచేయడం వారికి ఆచారమై పోయింది. అంచేత మళ్ళీ మరొక వినతి పత్రం పంపటం హాస్యాస్పదమవుతుంది. కాలాన్ని వృధాబుచ్చడమవుతుంది' - అని అన్నాడు జాన్ యాడమ్స్. కాని, ఆనాటి కాంగ్రెస్ సభలో చాలామంది, ఈ వాదనకు వ్యతిరేకంగా వుండటం వల్ల డికెన్సన్ సూచన ప్రకారమే మరొక వినతి పత్రం మూడవజార్జికి పంపడం జరిగింది. సభవారిలో అధిక సంఖ్యాకులు వినతి పత్రం పంపాలని నిర్ణయించిన మీదట, జాన్‌యాడమ్స్ తన మిత్రులతో ఆ పత్రం పై చేవ్రాలు చేశాడు.

ఈ ఉదయం, స్వాతంత్ర్య తీర్మానం వోటింగ్‌కి పెట్టబడుతున్న సమయంలో, డికెన్సన్, ప్రత్యర్థులను సంధిమార్గానికి తిప్పేందుకు శ్రమపడుతున్నాడు. తన భవనం డాబాలోకి వచ్చి, తల్లినీ భార్యనీ లాంచనప్రాయంగా పల్కరించి వెళ్ళిపోయాడు. తమ భద్రతనూ భవిష్యత్తునూ భంగపరచే పరిస్థితులు ఏర్పడుతున్నవని వారిద్దరూ చూచాయగా గ్రహించగలిగారు. డికెన్సన్ రాజకీయ ధోరణి వారికెంతగా నచ్చడం లేదు. అతివాదులు ఇతనిని తమ స్వప్రయోజనం కోసమై మితవాదుల వైపుకి నెట్టుతూ, అతని పేరు ప్రఖ్యాతులనూ, సద్వర్తననూ కుటిలమార్గాన మట్టిలోకి లాగుతున్నారని ఈ స్త్రీల అభిప్రాయం.

పొట్టిగా బొద్దుగా వున్న 41 సంవత్సరాల జాన్ యాడమ్స్, హెూటల్ గదిలోని వ్రాతబల్ల ముందు కూచున్నాడు. ప్రక్క గదిలో తన బంధువు 'శామ్' వున్నాడు. యాడమ్స్ గబగబా లేఖలు వ్రాసేస్తున్నాడు. సమావేశ ప్రారంభానికి పూర్వమే వీటిని పంపవలసి వున్నది. అతని నిత్యకృత్యాలు వుదయం నాలుగు గంటలకి ప్రారంభమవుతాయి. అర్ధరాత్రి 12 గం॥ దాకా అలా శ్రమిస్తూనే వుంటాడు. ఏ ప్రతినిధికీ లేనన్ని వ్యాపకాలు ఇతనికి వున్నాయి. అనేక కమిటీలలో సభ్యునిగా, అనేక కమిటీలకి అధ్యక్షునిగా తాపత్రయపడే వ్యక్తి జాన్ యాడమ్స్.

అతివాద ధోరణి అవలంబించి, విప్లవమార్గం తొక్కడంతో, తను దాటి వచ్చిన వంతెనలు తగుల బెట్టానని అతనికి తెలుసు. బాస్టన్‌లో తన ఆఫీసు మూసివేశాడు. ప్రఖ్యాత న్యాయవాదిగా అతను సంపాదించుకున్న పేరు, ఇప్పుడు నిరుపయోగం. రాబడి శూన్యం. ఇక, భార్యా పిల్లలు, శత్రు ఆక్రమిత ప్రాంతంలోని తమ వ్యవసాయ క్షేత్రంలో కష్టపరంపరల మధ్య జీవిస్తున్నారు.

ప్రారంభంలో జాన్ యాడమ్స్ తన చుట్టూగల మనషులు ఎంతో తెలివిగలవారనీ, మాట తప్పనివారనీ భావించాడు. తన భార్య

'యాబిగైల్'కి ఇలా వ్రాశాడు: "నా కళ్ళముందు ఒక మహోన్నత దృశ్యము కనిపిస్తున్నది ఈ కాంగ్రెస్ సభలోని ప్రతినిధులందరూ, వివేకవంతులూ, విజ్ఞానధనులూను."

సంవత్సరం తిరక్కుండా భార్యకి యిందుకు భిన్నమగు ధోరణిలో వ్రాశాడు. "ఇక్కడ జరుగుతున్న చరిత్ర నీకు చెప్పడము నా బాధ్యత. దానిని నీవు సాకల్యంగా తెలుసుకోవాలి. దేశం కోసం త్యాగము చేస్తున్నామనే నా తోటివారిలో కొందరు.... మూర్ఖపట్టుతో, అహంకృతితో అల్పచింతనతో పిడివాదంతోనూ శష్కచర్చలతోనూ విలువైన కాలాన్ని వృథాచేస్తున్నారు. కార్యవాదులు కారు, మాటకారులు. తమని నిలబెట్టి ప్రశ్నించే సమస్యలను పరిష్కరించగల ధీరత్వం వీరిలో కన్పించదు. కేంద్ర ప్రభుత్వాన్ని స్థాపించాలి. 1500 మైళ్ళ సరిహద్దును కట్టుదిట్టం చేయాలి. రక్షణ బలాలను వృద్ధిచేయాలి. వొళ్ళువంచి పనిచేయాలి. మాటలే తప్ప పనికి పూనుకోని వాగాడంబరులు...." ఆ ప్రకారం నడిచింది లేఖ.

డికెన్సన్ తన తూణీరంలోని బాణాలన్నీ ఈ స్వాతంత్ర్య తీర్మానాన్ని వోడించేందుకు వాడతాడని యాడమ్స్‌కి తెలుసు. అంతటి నైపుణ్యంతోనూ ఈ తీర్మానాన్ని నెగ్గించేందుకు తను దృఢకంకణుడై వున్నాడు. జఫర్‌సన్ లిఖించిన స్వాతంత్ర్య పత్రాన్ని సావధానముగా పరిశీలించాడు యాడమ్స్. నీగ్రో బానిసత్వం గురించి జఫర్‌సన్ వాడిన భాష తనకెంతో బావుంది. కాని ఈ పేరాలే దక్షిణ రాష్ట్రాల వోట్లని కూడ గట్టుకో లేక పోతామేమోనని పించింది. అయితేనేం, జఫర్‌సన్ వ్రాసిన ప్రతి వాక్యాన్ని ఒక పవిత్ర సూత్రముగా భావించి, అందులోని ప్రతిపదము కొరకూ పోరు సలిపేందుకు సంసిద్ధుడయి వున్నాడు యాడమ్స్. న్యూయార్క్ అసెంబ్లీలోని ఒక ప్రతినిధికి స్వదస్తూరితో చిన్న చీటి రాసిపంపాడు యాడమ్స్ "మీ న్యూయార్క్ ఇంకా నిద్రనుంచి లేవలేదా? లేక, లేవ దలుచుకోలేదా? స్వాతంత్ర్య శంఖారవం చెవుల పడని బధిరులా మీ ప్రజలు? మీ గాలీ, నీరూ అంత నిస్తేజములా?"

ఎత్తుపై ఎత్తులలో జాన్ యాడమ్స్ నిమగ్నుడై వుండగా, కజిన్ శామ్ కొత్త సూటు వేసుకు పెళ్ళికొడుకులా తయారవుతున్నాడు. కజిన్‌శామ్ కూడా ఏమంతడబ్బు గలవాడు కాదు, చాలా బీదవాడు. కాని బొస్టన్‌లోని అతని శ్రేయోభిలాషులు, తమ ప్రతినిధి చింకిపాతలతో ప్రభుత్వ భవనానికి వెళ్ళడము తమకే అవమానంగా భావించి ఈ కొత్త సూటు కుట్టించి పెట్టారు.

నిశ్చల అభిప్రాయాలు, స్థిరమైన నడవడికగల శామ్ యాడమ్స్ ఒకే ఒక లక్ష్యం కోసం జీవిస్తున్నాడు. గత ఇరవై ఏళ్ళగా తనే ఒక ప్రచార సంస్థయై ఎన్నివేల లేఖలు పంపాడో

లెక్కలేదు. ప్రజలలోని విప్లవ దృక్ప థాన్ని తీవ్రతరం చేయగల ప్రతిపనీ అతనిదే! రహస్య కమిటీల ఏర్పాటు, రహస్య వార్తాసేకరణ, బాస్టన్ హత్యల పట్ల ప్రజల సంతాపాన్ని ఆగ్రహాన్ని తెలిపేందుకు సభలు - వీటన్నిటి వెనుక నున్నది శామ్యూల్ యాడమ్స్. తేయాకు ఓడలు సరుకు దింపకుండా మారు వేషాలతో జాన్ హాన్ కాక్ తో ప్రదర్శన జరిపినది ఈ శామ్యూల్ యాడమ్స్. గత సంవత్సరం ఏప్రిల్ 19వ తేదీన వెల్సింగ్టన్ వద్ద ఇతనినీ, హాన్‌కాక్‌ని అరెస్టు చేద్దామని రాజ సైనికులు ఎంతో ప్రయత్నించి విఫలు లయారు. ఇతనిలోగల తొందర బాటుని జాన్‌యాడమ్స్ ఎంతో నేర్పుగా సరిది ద్దేవాడు. జాన్ మేధావి; ఓటమి నంగీ కరించని ధీరుడు. శామ్యూల్ చేయలేని పనులెన్నో అతను అవలీలగా చేయ గలడు. కాని జాన్‌ని, ఈ ఆందోళన కొరకై స్వాతంత్ర్యోద్యమ ప్రథమశ్రేణి వీరులలో ఒకనిగా ఎన్నిక చేసి ముందుకు తెచ్చినది శామ్యూల్ యాడమ్స్. గత యిరవై సంవత్సరాలు గా ఎందరెందరో యువకులని స్వాతం త్ర్యోద్యమ వీరులుగా రూపొందిస్తున్నదీ శామ్యూల్ యాడమ్స్, ఇతను కాంగ్రెస్ సమావేశాలలో ఎప్పుడో గాని మాట్లాడడు. ఒక విధంగా అతను నిర్వ హించవలసిన కార్యభారం పూర్తి అయినట్లే. ఫలసిద్ధే తరువాయి.

స్మిత్ హోటల్లో దిగిన ఎడ్వర్డ్ రట్లెజ్, వయోవిలాసంతో బాటు మేధా సంపదగల దక్షిణ కెరోలినా ప్రతినిధి. అతనితోటి ప్రతినిధులైన మిగతా ముగ్గురూ, రట్లెజ్ మాటకు తాళంవేస్తూ, విశ్రాంతి మందిరంలో ఖుషీగా గడుపుతున్నారు.

మొదట్లో జాన్ యాడమ్స్ యువకు డైన రట్లెజ్ షోకిల్లాయే గాని సమర్థుడు కాడేమో అని తలపోశాడు. కాని మూడు నెలలు తిరిగే సరికి తన అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది. 26 సంవత్స రాల ఈయువకుడు కాంగ్రెస్ ప్రతినిధు లందరిలోకి చిన్నవాడు. స్వరాష్ట్రానికి సంబంధించిన సమస్త వ్యవహారాల లోనూ జోక్యం కలిగించుకుని, చేతనైన విధంగా పని చేస్తూండేవాడు. దక్షిణ కెరోలినా నుంచి వచ్చిన నలుగురు యువక ప్రతినిధులు, ధనిక కుటుం బాలకి చెందిన వారు. ఈ నలుగురూ కూడా లండన్‌లోని 'మిడిల్ టెంపుల్' లో న్యాయశాస్త్రం పట్టా పుచ్చుకు వచ్చిన వారే!

ఈనలుగురూ స్వరాష్ట్రాభిమానులై వుండటంవల్ల, తమ ప్రజకి ఏది లాభ దాయకమో అటువైపు మొగ్గుతూండే వారు. కేంద్ర మనదగు కాంగ్రెస్‌కి ఎంత తక్కువ అధికారముంటే, అంత శ్రేయోదాయకమని భావించే వారు. ఈ నలుగురి తరఫునా వ్యవహారకర్త రట్లెజ్. 'మా బెత్తం మాకు వుండాలి, మాచేతి బెత్తం మరొకరి చేతుల్లో పెట్టి నపుడు ఏదైనా జరగవచ్చు' అని అంటుండేవాడు రట్లెజ్

స్వాతంత్ర్య పత్ర ప్రకటనకి బద్ధ వ్యతిరేకి రట్లెజ్. ఈ ప్రకటన ప్రమాద కర పరిణామాలకు దారి తీసుందని

అతని ఉద్దేశ్యం. రిచర్డ్ హెన్రీ లీ కాంగ్రెస్ సభలో నిలబడి, ఈ తీర్మాన సూచన చేసిన నాటినుంచీ వారుఇందుకు వ్యతిరేకులు, వలసలు స్వయం నిర్ణయాధికారము కలిగి స్వతంత్ర రాష్ట్రముల వారిని, ఈ స్వతంత్ర రాష్ట్ర సమాఖ్య-'క్రాన్ ఫెడరేషన్' సర్వస్వాతంత్ర్య పాలనాధికారము కలిగినదై, విదేశ వ్యవహారాలని, దేశ క్షేమ దృష్ట్యా పరిష్కరిస్తుందని హెన్రీ లీ ప్రవేశ పెట్టిన తీర్మాన సారాంశము. ఈ తీర్మానము పై నాలుగు రోజులపాటు తీవ్ర వాగ్యుద్ధం జరిగాక, రట్లెజ్ చర్చని జూలై ఒకటో తేదిన తిరిగి ప్రారంభిద్దామనివాయిదాతీర్మానం ప్రవేశ పెట్టాడు. ఆవాయిదా తీర్మానాన్ని సభ ఆమోదించింది. ఇదే ఆ జూలై ఒకటవ తేదీ.

ప్రభుత్వ భవనము వైపు వస్తున్న డాక్టర్ ఫ్రాంక్లిన్, తెలిసిన ముఖాలను చిరునవ్వులతో పల్కరిస్తున్నాడు. ఆయన రాజబాట మీద కనిపించిన పుడల్లా ప్రజలు తమ హర్షాన్నీ, విధేయతనీ తెలియబరిచేవారు. డాక్టర్ ఫ్రాంక్లిన్ పెన్సిల్‌వేనియా, మేసాచుసెట్స్, జార్జియా రాష్ట్రాల ప్రతినిధిగా లండన్‌లో పదేళ్ళు వున్నాడు. పోయిన మే నెలలోనే ఆయన స్వదేశానికి తిరిగి వచ్చాడు. ఫిలడల్ఫియాలో ఇతనిని ముద్రాపకునిగా గుర్తు పెట్టుకున్నారు. కొందరు స్థానిక ధనికులు ఇతనిని వ్యాపార దక్షునిగా భావించే వారు. ప్రపంచపరివ్యాప్తంగా డాక్టర్ బెంజిమిన్ ఫ్రాంక్లిన్, న్యూటన్, లాకె. ఫ్రెడరిక్ దిగ్రేట్ కోవలో చూడబడుతూండే వాడు. తన గుర్రపు బగ్గీలో వెళ్తున్న ఈ డెబ్బయి సంవత్సరాల వృద్ధునికి ప్రజలు వినయపూర్వకంగ నమోవాకాలు తెలిపేవారు.

రాళ్ళబాట మీదుగా గుర్రపుబగ్గీల చక్రాలు గలగల శబ్దము చేస్తున్నాయి. సరుకుల బళ్లు పడవల రేవు వైపుగా పోతున్నాయి. నల్లదుస్తులు ధరించిన క్వేకర్లు ప్రార్ధనా మందిరమునుంచి మళ్ళుతున్నారు. వర్తకులూ, గుమాస్తాలూ, వ్యాపార కేంద్రాలకి వెళ్ళుతున్నారు. రక్షణ సేనాపంక్తులు బారులు తీర్చి కవాతు ప్రదర్శన చేస్తున్నాయి. అసంఖ్యాతులైన హస్తనిపుణులు, యంత్ర నిపుణులు, చిన్న వ్యాపారులు తమతమ కార్యాలయాల వైపు వెళ్తున్నారు. రాజకీయంగా ఇంతటివుద్రిక్త పరిస్థితి ఏర్పడినప్పటికీ, సామన్య ప్రజలు ఎవరి పనులలో వారు మునిగివున్నారు.

ఈ శ్రామిక జనాభా నుంచి అతి సామాన్య పరిస్థితులనుంచి ఒక ముద్రాపకునిగా జీవితము ప్రారంభించి నెమ్మది నెమ్మిదిగా తన స్థానాన్ని పటిష్ఠము చేసుకొని రాజులతో కయ్యానికి దిగిన, బెంజిమిన్ ఫ్రాంక్లిన్, సంతుష్టితో ముందుకి సాగుతున్నాడు. ఈ పట్నంలోని ప్రతిభాగము లోనూ అతని చేతి చలవ, అతని శ్రమకి చిహ్నామూ, అయిన గుర్తు ఏదో ఒకటి వున్నది. ఈ వీధుల్లో దీపాలు, వీధి చివర్ల నీళ్ళ పంపులు, పిడుగు పాటుకి భవనాలు కూలకుండా [illegible]

అగ్నిమాపకదళం, ప్రజల కోసం గ్రంధాలయమూ, తాత్త్వికసంఘ భవనాలూ యివన్నీ ఫ్రాంక్లిన్ జీవితముతో పాటు పెరిగి, వొడుదుడుకులకు లోనై ఈనాడు ఒక నిశ్చల రూపము దాల్చి, ప్రజాహితైషి శ్రమకు ప్రతి ఫలముగా కనబడుతున్నాయి.

జూన్ ఆఖరు వారంలో స్వాతంత్ర్య పత్రప్రతి ఫ్రాంక్లిన్ కి చూపి, మార్పులూ చేర్పులూ సూచించమని కోరాడు జఫర్సన్, ఫ్రాంక్లిన్ ఆ పత్రాన్ని ఎంతో శ్రద్ధగా పరిశీలించి, అక్కడక్కడ కొన్ని సూచనలు చేశాడు. ఆ మార్పులు వాక్య నిర్మాణానికి చెంది నవేతప్ప భావార్థానివి కావు. ఫ్రాంక్లిన్ కి ఈ స్వాతంత్ర్య ప్రతిపాదన ఎంతో ఆనందదాయక ఘట్టం. ఆ ఉదయము ప్రభుత్వ భవనము వద్దకు వస్తూ, కాంగ్రెస్ ప్రతి నిధులు ఈ సాహస ప్రకటనకు ఎలా చకితులవు తారో చూడ కుతూహల పడుతున్నాడు ఫ్రాంక్లిన్. తన స్వరాష్ట్రమైన పెన్సిల్వేనియా నుంచి వచ్చిన ప్రతినిధివర్గం, ఈ తీర్మానాన్ని వ్యతిరేకిస్తుందని అతనికి తెలును. మితవాద సభ్యులైన జాన్ డికెన్సన్, రాబర్ట్ మారిస్, ఛార్లెస్ హంఫ్రిజ్, థామస్ విల్లీ ఈ తీర్మానానికి బద్ధవిరోధులు.

స్వాతంత్ర్య పత్రాన్ని తయారు చేయడానికి ఏర్పాటైన ఐదుగురు సభ్యుల కమిటీలోనూ ఇద్దరు ఇందుకు వ్యతిరేకులు,. కనెక్టికట్ కి చెందిన షెర్మాన్ స్వాతంత్ర్య ప్రతిని పోయిన శుక్రవారము చూశాడు. ఛాందసుడైన ఈ షెర్మాన్ దీనిని ప్రార్థన పాఠము చదువుతున్నట్లుగా ప్రతీ పదమూ జాగ్రత్తగా పలుకుతూ చదివి, "ఆహా - బావుంది" అని అనుకుంటూ, తన అంగీకారము తెలిపాడు.

ఒకప్పుడు జోళ్ళు కుట్టడమే వృత్తిగా గల ఈ షెర్మాన్, ఆ జోళ్ళు కుట్టే బల్ల వద్దనే గణితశాస్త్రమూ, న్యాయశాస్త్రమూ చదువుకొని, కొన్నాళ్ళు సర్వేయరుగా, తరువాత న్యాయాధికారిగా, ఆ తర్వాత న్యాయ నిర్ణేతగా పని చేశాడు. ఇప్పుడతని వయసు యాభైఅయిదు. వేషభాషలలో పాత కాలపు పద్ధతి అవలంబించేవాడు. కాంగ్రెస్ సభలోని కొందరు ప్రతినిధులు అతనిని మొదట్లో ఎగతాళిగా చూసేవారు. అతని వుచ్చారణ పాటకజన ధోరణిలో వుండేది. ప్రతిదానికీ- ఎందుకూ, ఏమిటీ - అని బాలకునివలె ప్రశ్నించి, వాటి అంతూ పంతూ తేల్చుకునే వాడు. మొదట్లో ఇతను మూర్ఖుడని కొందరు భావించినా, తరువాత తరువాత యీ వింత వ్యక్తిని గౌరవించడము నేర్చుకున్నారు. ఇతనిని మాటలలో బోల్తా కొట్టించ గలగడము అసాధ్యము - అన్నాడు ఒక ప్రతినిధి. వివేకవంతుడు, విశుద్ధజీవనుడు, వినిర్మల హృదయుడు ఈ షెర్మాన్ - అని జాన్‌యాడమ్స్ అభిప్రాయము.

కమిటీలో అయిదవ సభ్యుడు రాబర్ట్ లివింగ్‌స్టన్ పోయినవారమే, న్యూయార్క్ నుంచి ఇక్కడి కొచ్చాడు. ప్రజా శ్రేయస్సు కోరే ఈ యువకుడు,

ఇంత సాహస ప్రకటనకు, అదను రాలేదని భావించాడు, అందువల్ల తను ఈ విషయములో దూరముగా వుండదలిచాడు.

రేవు వద్ద హొటల్లో స్థిమితముగా కాఫీ తాగుతూ, స్థానిక పత్రికలు చకచకా తిరగ వేస్తూ కూర్చున్నాడు డేగ ముక్కు ఆంగ్లేయ డొకడు. అతని వయసు ముప్ఫయి తొమ్మిది. తాజావార్తలకోసమై అతని కళ్ళు వెతుకుతున్నాయి. ఈ స్వాతంత్ర్య పోరాటంలో అతని పాత్ర ఏ మాత్రమూ చిన్నది కాదు. ప్రభుత్వ సమావేశాలని దగ్గర వుండి పరిశీలించే అవకాశము లేదు టామ్‌పెయిన్‌కి. లండన్ మురికి పేటలనుంచి పుష్పించిన మహామేధావి, యీ పోరాటంలో అన్యునివలెనే వున్నాడు. కాని కాంగ్రెస్ ప్రతినిధులందరూ వేలాది యితర ప్రజలతో బాటు, అతను రచించిన 'కామన్‌సెన్సు' అను కరపత్రాన్ని ఎంతో శ్రద్ధగా చదివారు. ఒకానొక బ్రిస్టల్ పత్రికలో మూడు నెలలు క్రితము రాసిన పాఠకుని లేఖను సావధానముగా పరిశీలిస్తున్నాడు టామ్ పెయిన్. ఆ లేఖలో ఇలా వుంది: 'విదేశీ సేనలు మన నౌకా బలంతో కూడా ప్రయాణించవలసి వున్నదని అజ్ఞ జారీచేసినట్లుగా తెలుస్తున్నది. అయిదుగురు శాంతి దూతలని ఏర్పాటు చేయనున్నారని అంటున్న మాట నిజమేకాని వారు ఎవరెవరో, ఎప్పుడు బయలు దేరుతారో అంతా అగమ్యగోచరముగా వుంది. ఈ శాంతి దూతలు అమెరికనుల విన్నపాలను పరిశీలించి, క్షమాపత్రాలను అనుగ్రహిస్తారు .... సుమారు, అయిదువందల నౌకలు యుద్ధ సామగ్రితో, తొమ్మిదివేల బళ్ళూ రెండు వేలఏడువందల గుర్రాలు మున్షై నుంచి యాభైవేల దాకా సైనిక బలముతో ప్రయాణానికి సిద్ధంగా వున్నాయి. క్విబెక్ రంగంలో బర్గానీ, న్యూయార్క్ రంగములో హవ్, దక్షిణ ప్రాంతాల క్లింటన్ సైన్యాధిపత్యం వహించి సేనలు నడిపిస్తారు.'

టామ్‌పెయిను ఆ వార్త కాస్తా చింపుకొని భద్రపరిచాడు. అన్యాయాలనీ, దుష్పరిపాలనని ఖండించి కఠిన సత్యాలు బయట పెట్టడములో అతను అగ్రగణ్యుడు. కష్టపడి విద్యా వివేకాలు నేర్చుకున్న ఈ శ్రామికునికి రాజులైనా బానిసలైనా ఒక్కటే. ప్రజలందరినీ మానవులుగా చేయాలనేదీక్షా పరుడు, రెండు సంవత్సరాల క్రితము ఫిలడల్ ఫియాలో దిగినప్పుడు అతనికి గల ఏకైక సంపద, డాక్టర్ ఫ్రాంక్లిను పేర ఎవరో మిత్రులు ఇచ్చిన చిన్న పరిచయలేఖ. ఆ పరిచయ లేఖ ఆధారంతో ఒక కొత్త పత్రికలో సంపాదకోద్యోగము దొరికింది. కళ్ళూ చెవులూ ఎప్పుడూ తెరిచి వుంచుకొనే యీ వ్యక్తి, తనకి తటస్థబడే యావన్మంది వ్యక్తులతో అనేకానేక విషయాలు తర్కించి, పదమూడు వలసల ప్రతినిధులతో మాట్లాడి, వారి మనోభిప్రాయాలు తెలుసుకున్నాడు. ఆరు

నెలలు క్రితము నామరూపాలు లేకుండా ఒక విప్లవాత్మక కరపత్రాన్ని, తన స్వంత ఖర్చుమీద అచ్చొత్తించి ప్రచురించాడు. ఆ 'కామన్ సెన్సు' కరపత్రం ప్రజల పాలిటి స్వాతంత్ర్య శంఖారవం వలె ధ్వనించింది. ఆ కరపత్రంలో టామ్ పెయిన్ అంటాడు. "ప్రాచీన ప్రపంచంలోని ప్రతి అంగుళమూ పీడిత ప్రజానీకంతో నిండి వుంది. ఈ భూమిమీద స్వాతంత్ర్య మనే మాట వినబడకుండా పరిపాలకులు దానిని వేటాడుతున్నారు. ఆసియా, ఆఫ్రికా ఖండాలనుంచి స్వాతంత్ర్య మనేది ఏనాడో మాయమయినది. యూరప్‌లోని ప్రజలు కూడా స్వేచ్ఛావాయువుని మర్చిపోయారు. ఆ పవిత్రజ్యోతిని తిరిగీ వెలిగించ గల సమర్థత, సాహసమూ ఈ నూతన ఖండానికి మాత్రమే వున్నాయి. స్వాతంత్ర్య లక్ష్యంగల ప్రతి వ్యక్తికీ ఈ ఖండమే ఒక ఆశాదీపం. వలసలు ధైర్యంతో ముందంజవేసి, ప్రజానీకంపై సామ్రాజ్యశక్తులు జరిపే దారుణ హింసాకాండని ఎదుర్కొన వలసి వుంది"

టామ్ పెయిన్ అమెరికనుల భాధ్యతలను వివరించి చెప్పడమే గాక భవిష్యద్వాణిని కూడా పలికాడు: "పరిస్థితులు మిమ్మల్ని తప్పక విజయపథానికి తీసుకు వెళ్తాయి. ప్రజలని బానిసలుగా చేసేందుకు గాక బానిసత్వ నిర్మూలనకై మీరు పోరాడుతున్నారు గనుక ఈ పోరాటములో మీరు విజయము పొందగలరు. ఈ పృథ్విపైన ఉత్తములూ నిజాయితీ పరులూ, సత్యసంధులూ జీవించేందుకు ఆస్కారము కల్పిస్తున్నారు గనుక దైవికశక్తులు మీకు సాయపడి జయము చేకూరుస్తాయి."

టామ్ పెయిన్ కరపత్రం చదివి జనరల్ వాషింగ్టన్ దానిని ఎంతో మెచ్చుకుంటూ పవిత్ర సిద్ధాంతాలూ, తిరుగు లేని హేతువాదమూ ఈ కరపత్రములో ప్రతిబింబిస్తున్నాయి - అన్నాడు,

ఈ జూలై ఒకటో తేది ఉదయము ఫిలడల్ఫియాకి వందమైళ్ళ దూరాన వున్న వాషింగ్టన్, న్యూయార్క్ పట్నాన్ని సంరక్షించే సమస్యలో చిక్కుబడి వున్నాడు. సముద్రతీరాన ఏర్పాటుచేస్తున్న రక్షణ కార్యక్రమము అతి శీఘ్రంగా ముగిస్తే తప్ప, శత్రువు తమని అకస్మికంగా ఎదుర్కొనవచ్చు. తనకు అధిక సేనలూ, అవసరవస్తువులూ కావాలని కబురు పంపాడు. న్యూయార్క్ నగర రక్షణ కొరకై వలసల నుంచి సేనలు పంపమని కోరాడు. హవ్ నౌకాదళము న్యూయార్క్ వైపుగా వస్తున్నది-వారు ఇంగ్లండు నుంచి రాగల నౌకా సమూహము కోసమై వేచి వున్నారు. వాషింగ్టన్ తన సేనాధిపతులతో రక్షణ సన్నాహాలు కడు జాగరూకతో పరిశీలిస్తున్నాడు.

క్రౌన్ పాయింట్ వద్ద బెనెడిక్ట్ ఆర్నాల్డ్, కెనడా నుంచి వచ్చిన బర్గానీ సేనలకు ఎదురు నిల్చి వున్నాడు. న్యూయార్క్ రేవుని ఏక్షణా

నైనా రాయల్ నౌకాదళము ఎదు ర్కొనవచ్చు. ఆ రేవును ధ్వంసంచేసి విప్లవ సేనలని కాళ్ళ బేరానికి తీసుకు రావాలని అంగ్లపాలకుల ప్రయత్నము. జనరల్ వాషింగ్టన్ వద్ద తగినంత యుద్ధ సామగ్రిలేదు.

ఫిలడల్ఫియాలో పోయిన జూన్ మాసములో విప్లవకారుల సమావేశము జరిగినప్పుడు. వర్జీనియా రాష్ట్ర ప్రతినిధిగా జార్జి వాషింగ్టన్ పంపబడ్డాడు. పొడగరీ, దృఢకాయుడూ, ధనవంతుడూ అయిన యీ జార్జి వాషింగ్టన్ సుస్థిరత్వానికీ, వినయ సౌశీల్యాలకీ చిహ్నంగా కనిపించాడు. విప్లవ ప్రతినిధులతో కాస్తో కూస్తో మిలటరీ అనుభవమున్న మనిషి ఇతనొక్కడే. విప్లవ సేనలని తను నడిపించాలని యితనెన్నడూ కాంక్షించలేదు. మీదు మిక్కిలి విప్లవ ప్రతినిధులు ఇతనిని సర్వసైన్యాధిపతిగా పేర్కొన్నప్పుడు. "నేను యింతటి కార్యభారాన్ని నెరవేర్చగల సమర్థుణ్ని కాను: నన్ను మన్నించండి" అని క్షమార్పణ చెప్పకున్నాడు. కాని మిగతా వారు వొప్పకోలేదు. 'మాకు నీ మీదే నమ్మకముంది' - అన్నారు. సర్వసైన్యాధిపతిగా ఎన్నికైన సాయంత్రము తన మిత్రుడైన పాట్రిక్ హెన్రీ వద్ద కెళ్లి కన్నీళ్ళతో ఇలా చెప్పకున్నాడు: "హెన్రీ, నామాట నమ్ము - నేను ఈ విప్లవ సేనల సర్వసైన్యాధిపతి నవడంతో ఈ రోజునుంచీ నా పతనం ప్రారంభమవుతుంది - నా మంచి పేరు ఇక మట్టిపాలవుతుంది."

అయిదు వారాల క్రితము జనరల్ వాషింగ్టన్ ఫిలడల్ఫియా వెళ్ళి, న్యూయార్క్ నగర రక్షణావశ్యకత గురించి, కాంగ్రెస్ ప్రతినిధులతో మాట్లాడి వచ్చాడు. వర్జీనియా ప్రతినిధి ఫ్రాన్సిస్, ఎవరిది సముద్రాధిపత్యమయితే వారికే అ పట్నం వశమై తీరుతుంది, అని వొప్పకునాడు. బ్రిటిష్ నౌకా సంపద సాటిలేనిది. వలసలకు నౌకాబలమన్నదే లేదు. కాని, పోరాటం లేకుండా ప్రథమంలోనే ఓటమి నంగీకరించడం ఇంకా ప్రమాద కరము; న్యూయార్క్ సంరక్షణ అమెరికన్ ప్రజాభి ప్రాయానికి చిహ్నముగా వుండాలని నిర్ణయించుకున్నారు.

1776 జూలై 1వ తేదీ వుదయం 9 గంటల వేళ జనరల్ వాషింగ్టన్, పట్నం చుట్టూ ఒకసారి తిరిగి వచ్చి, బౌలింగ్‌గ్రీన్ వైపు వెళ్తున్నాడు. సైనికోద్యోగులలో కొందరు రక్షణ శ్రేణి వద్ద నిలబడి, ఉన్నతాధికారులని హత్య చేయడం విషయమై, జరుగుతున్న కుట్ర గురించి మెల్లగా మాట్లాడుకుంటున్నారు. ఆ పట్టికలో మొదటి పేరు జనరల్ వాషింగ్టన్ ది. జనరల్ వాంషిగ్టన్ హత్య చేయబడటంతో, న్యూయార్క్ నగరంలోని రాజవర్గీయులు, దానిని ఒక నాందిగా భావించి, విప్లవ సేనలలోకి అంతఃకలహము తీసుకువస్తారు. బౌలింగ్‌గ్రీన్ ఒక చివరగా మూడవజార్జి శిలావిగ్రహమున్నది. వాషింగ్టన్ ఆ విగ్రహాన్ని

పరిశీలిస్తూ నిలబడ్డాడు. ఆరు సంవత్స రాల క్రితము, ఈ నగర ప్రజలు చందాలు వేసుకుని, తమ రాజు గారి కోసమై ఆ శిలా విగ్రహం నిర్మించారు. ఆ రాజు గారి సేనలే, నేడు, ఈ పట్నాన్ని నేల మట్టము చేయడానికి సిద్ధముగా వున్నాయి.

న్యూయార్క్ నగరం వొక ద్వీపం. ఆ ద్వీపానికి మూడు వేల మైళ్ళ దూరంలో వున్న మరొక ద్వీపంలో విండ్సర్ భవనంలోని తన పఠన మందిరం పక్క భాగంలో మూడవజార్జి యుద్ధ పటాలు పరిశీలిస్తున్నాడు. అతని బుద్దికి అంతా భేషుగ్గా వుంది. ప్రతిదీ తన ప్లాను ప్రకారం జరిగి పోతున్నది. రిచర్డ్‌హావ్ ఆధ్వర్యాన నడుస్తున్న నౌకా దళము న్యూయార్క్ చేరుకుంటున్నది. హాలీఫాక్స్ నుంచి వస్తున్న సర్ విలియమ్ హావ్ దళాలతో అది చెయ్యి కలుపుతుంది. ఉత్తరాన్నుంచి జనరల్ బర్గానీ న్యూయింగ్లండుపై దాడి జరిపి. దానిని మిగతా వలసల నుంచి చీలదీస్తాడు, దక్షిణాన సర్ హెన్రీ క్లింటన్, ఛార్లెస్టన్‌ని ఆక్రమించి న్యూయార్క్ నగరాన్ని వశపరచుకున్న హావ్ సోదరులని కలుసుకుంటాడు. ఈ విధముగా వలసలకి బుద్ధి చెప్పడమవు తుంది - వారప్పుడు కాళ్ళ బేరానికి రాక తప్పదు.

జార్జి రాజు ఈ యుద్ధ వ్యూహాలు పరిశీలిస్తున్నపుడల్లా ఒక వికృతానం దంతో పొంగి పోయేవాడు. ఆ వుత్సా హాతిరేకం అతని ఆరోగ్యానికి చేటు తెస్తుందని వైద్యులు అతనిని వారి స్తున్నా వినడం లేదు, మృగయా వినో దంలో ఆరితేరిన ప్రభువు ఈ జార్జి, అతని వయసు ముప్పయి ఎనిమిది. గత పదహారేళ్లగా రాజమాత, 'అబ్బాయ్, నువ్వు రాజువి - నీ రాజరికం మర్చి పోకు' - అని అనుక్షణమూ గుర్తు చేస్తోంది. ఆ మాతృ వాక్యమే అతనికి మార్గ సూచకంగా పరిణమించింది. నిబంధనాయుతమగు అతని దైనందిన కార్యక్రమం ప్రాతః కాలాన ప్రార్థనల తో ప్రారంభమై రాత్రి వేళ గానరసా స్వాదనతో ముగిసేది. ఈ మధ్యగల కాలమంతా గంటల వారీ కేటాయింప బడి, యాంత్రికంగా గడిచిపోయేది.

ఈ ఉదయం పదిగంటలకు రాజు గారు నార్త్ ప్రభువుకు దర్శన మిస్తాడు. ప్రధానియైన నార్త్ ప్రభువు రాజ్యాంగ విషయాలు, వివరాలు, రాజు గారికి మనవిచేయడం ఒక లాం ఛనం. ఈ మధ్య నార్త్ ప్రభువుకి కూడా రాజు గారి వైఖరి కొంచెం చిరాకు కల్గిస్తూ, ఇది వివేక మార్గమా అను సంశయం తెచ్చి పెడుతోంది. పాలనా దక్షునికి సంశయాకుల చిత్తం క్షేమకరం కాదు. ముప్పై పైగా గల వలసలలో పదమూడు తిరుగుబాటుని ప్రకటించి, విప్లవ పంథాలో నడుస్తు న్నాయి. తమ సామ్రాజ్యశ్రేయం కోసం రాజుగారు యింకొంచెం నేర్పుగా ప్రవర్తించాలి. ఒక సంవత్సరం క్రితం నార్త్ ప్రభువుతో జార్జిరాజు అన్నాడు: "ఆ వలసలు మనకి విధేయంగా వుండేదీ లేనిదీ దండోపాయం వల్ల తేల్చుకోవాలి. మనపాలనాధికారానికి

లోబడి మన సంరక్షణలో అవి వుండే దీ, లేనిదీ మన సైనిక బలమే నిర్ణయి స్తుంది. ఆ సేనలతో పాటు మన శాంతి దూతలనుకూడా పంపవచ్చు. ఈ శాంతి దూతలు వలస దారుల అపజయాన్ని ఆమోదిస్తారు. బేషరతుగా లొంగిపోక తప్పదు."

జార్జిరాజు తన వలసల విషయమై తాను చాలా వోర్పు ప్రకటిస్తున్నానను కొన్నాడు. అధికారదాహం గల స్వార్థ పరుల కుట్రలకు లోనైన వలస ప్రజలు మితిమీరి ప్రవర్తిస్తూ, తన ఆజ్ఞలను ధిక్కరిస్తున్నారు. రాజైన వాడు ఈ ధిక్కారమును సహించలేడు. ఈ పరిస్థితులు కలకాలము సాగవు. వలస ప్రజలు ఆంగ్ల పాలనకు బద్ధులై వుండి, ఆంగ్ల సంరక్షణని కోరాలి, లేదా, వారి దారి వారు చూసుకోవాలి, ఫిలడల్ఫియా లోని ఒక విద్రోహుల ముఠా, బ్రిటిష్ పార్లమెంటుని భయ పెట్టి తమ ఆశలు నెరవేర్చుకోవాలని చూస్తున్నదా? వంశాను క్రమంగా న్యాయబద్ధంగా యీ సింహాసనానికి సంక్రమించిన పవిత్ర హక్కులను ఆ ముఠా ఎదిరించదలచుకున్నదా? ఈ పనిలేని న్యాయవాదులు తన అధి కారాన్ని కాదంటూ విపరీతబుద్ధితో ంత మహజర్లు పంపుతారా? 'ఈ ద్రోహులు యింకెక్కడికి పారిపో గలరు? ఉరి కంబం వారికై ఎదురు చూస్తోంది' - అనుకుంటూ తృప్తి పడ్డాడు మూడవ జార్జి. (ఇంకా వుంది

—మాతృక : కార్నెల్ వెస్‌గ్వెల్

—తెలుగు : యన్నార్ చందూర్



సంస్కృతి, నాగరికత - ఈ రెండూ నిర్వచించడానికి క్లిష్టమైన పదాలు. అంచేత, నేను వాటిని నిర్వ చించేందుకు ప్రయత్నించను.

— నెహ్రూ

డెబ్బయి సంవత్సరాలు మీకు వచ్చాక, వేళకు భోంచేస్తారు; నిర్వి చారంగా నిద్దర పోగలుగుతారు; ముప్ఫయ్యో ఏటికంటె ఎక్కువ సచేత నంగా వుండగలుగుతారు, అందుకు కారణమేమిటంటారా, అందచందాల అతివలు సరసనగాక మనుసున వుండ టం.

— మారిస్ షెవిలియర్

పెద్దవాళ్లెప్పుడూ యువకులకి డబ్బు నిలవచెయ్యమని సలహాలిస్తూ వుంటారు. అది అర్థహీనమగు సలహా. ప్రతి పైసా జాగ్రత్త చేయాలనే తలంపు క్షేమకరం కాదు. మీ ఖర్చు మీ జీవనావకాశాలని పెంచేదిగా చూసుకోండి. నలభై ఏళ్లు నిండాక గాని 'నిలవ' అనే మాట నా మనసు లో ప్రవేశించలేదు.

— హెన్రీ ఫోర్డ్




## 1988 జూన్ 01

"మన దేశాన్ని మూడు వర్గాలుగా విభజించవచ్చు. ఒకటి: అరశాతం లోపునున్న అధిక సంపన్నులు - వీరు అన్ని దేశాలలోని భాగ్యవంతులకి మల్లేనే జీవిస్తున్నారు. ఆ తర్వాత 18 లేక 19 శాతం వుండే మధ్య తరగతి- దీనినే 'సిక్స్‌త్ లా ర్జె స్ట్ మాన్‌పవర్' (sixth largest man - power) అని చెబుతూ వుంటారు. ఈ తరగతి లోని కొందరు మొదటి తరగతిలోనికి వెళ్లవచ్చు - మొదటి తరగతిలోని కొందరు ఈ తరగతిలోకి జారవచ్చు. పోతే, దేశ జనాభాలోని మిగతా 80 శాతానికి మన రాజకీయ విన్యాసాలు తెలియవు. రాజకీయ ప్రభావాలు సైతం వారికి జన్మ కర్మల వలయం లోనివి - అంతకి మించి వారు పట్టించు కోరు. ఈ ప్రజానీకాన్ని వుద్ధరింప బూనే ప్రతాపాలన్నీ 18 శాతం మధ్య తరగతిలోనివనీ, వారి వారి అనుకూల ధోరణులే ప్రజాభిప్రాయంగా వ్యాఖ్యా నిస్తున్నారనీ మనం మర్చిపోకూడదు ....పంజాబ్ విషయమే తీసుకోండి - అనునిత్యం దినపత్రికల పతాక శీర్షిక లలో, టెర్రరిస్టుల వల్ల ఎన్ని హత్యలు, ఎన్ని దారుణాలూ జరిగేదీ చూస్తూ వుంటాం. అయితే, ఈ బీభత్స పరిస్థితుల కారణంగా అక్కడి పంటలు పడి పోలేదు సరిగదా, ఆ ఏటికాఏడు పెరుగుదల చూపిస్తున్నాయి - రుణాలు తీసుకున్న రైతులలో 95 శాతం సక్రమంగా చెల్లిస్తున్నారు - ఏ రాష్ట్రంలోను 'రీపేమెంట్' అంత అధిక స్థాయిలో లేదు. పరిశ్రమలు నిక్షేపంగా నడుస్తున్నాయి. ప్రజా జీవితం ఏ విధంగానూ స్తంభించలేదు. కాని మిగతా భారతావనిలోని ప్రజలలో మాత్రం, పంజాబ్ మండిపోతోందనీ సిక్కులు కేంద్రం నుంచి విడిపోవా లనే విద్రోహకరప్రయత్నం చేస్తున్నా రనీ ఒక నిరాధారమైన అభూతకల్పన వ్యాప్తి నొందింది. పత్రికలూ ప్రభుత్వ ప్రచార యంత్రాంగమూ ఈ విష యంలో తమ వంతు దోషం అంగీ కరించక తప్పదు. సిక్కులు తమ మత విశ్వాసాన్ని రాజకీయలక్ష్యం కోసం వినియోగిస్తున్నారనే అపవాదు ఉంది. మాట వరసకి వొప్పుకుందాం. కుల మతాలనీ, ప్రాంతీయ ధోరణులనీ రాజకీయాల కోసం వినియోగించినది వారు ఒక్కరేనా? సెక్యులరిజమ్ అనే

ముసుగులో ఈ కలుషిత వాతావర ణాన్ని సృష్టించిన దెవరు? అన్ని రాష్ట్రాలలోని ప్రజలకి మల్లేనే సిక్కులు కూడా ఈ దేశ సమగ్రతనీ సమైక్య తనీ త్రికరణ శుద్ధిగా కాంక్షిస్తున్నారు ....'అపరేషన్ బ్లూ థండర్' ని అభి నందించని సిక్కులేడు. అదే విధంగా 'అపరేషన్ బ్లూ స్టార్' జరిగి వుంటే, ఇందిరాగాంధీని మనం పోగొట్టుకొని వుండే వారము కాదేమో !.... ఫెరోజ్ పూర్ ఒకప్పుడు క్రయిమ్‌కి ప్రసిద్ధి; ఈ నాలుగైదేళ్లగా క్రయిమ్ అనే మాట వినడం లేదు - సమస్తం టెర్రరిజమ్ కిందకే వస్తోంది. విజ్ఞతగల ఏ వ్యక్తీ టెర్రరిజమ్‌ని సమర్థించడు - ఈ దేశం లోనే కాదు, ఏ దేశంలోనూ సమ ర్థించడు.........నా దృష్టిలో ఈ పం జాబ్ సమస్య, 1971 నాటి జనాభా లెక్కలలో, సంకుచితవాదులు గురు ముఖికి సముచిత స్థానమివ్వక, హిందీగా నమోదు చేయించడంతో, ఆవేశకావేషాలు పెరిగి, ఈ యిబ్బందు లన్నీ తలకి చుట్టుకున్నాయి.... ఎవరు మిలిటెంట్స్, ఎవరు టెర్రరిస్టులు? టెర్రరిజానికి మతం లేదు, ధ్యేయం లేదు. దోచుకోవడమూ, ప్రజలని భయ పెట్టడమూ - అవే దాని లక్ష్యాలు.... టెర్రరిజాన్ని నిర్దాక్షిణ్యంగా అణిచి వేయవలసిందేగాని అక్కడితో సమస్య తీరదు. రాజకీయ పరిష్కార మార్గం అన్వేషించాలి" అని చెప్పారు, యూత్ లైన్ ఫర్ హ్యూమనిజమ్ వారు (Youth Line for Humanism) కెన్నమెరా బిన్నిరూమ్‌లో ఏర్పరిచిన సమావేశంలో, చండీఘర్ నుంచి వెలు వడే 'ప్రఖ్యాత అంగ్ల దినపత్రిక 'ట్రిబ్యూన్' (Tribune - 108 years) ముఖ్య సంపాదకులైన వియస్ నారా యణన్. పోయినసారి మద్రాసు ప్రెస్ క్లబ్‌లో (జగతి - 370....డైరీ - 1987 ఫిబ్రవరి 16) మాట్లాడినంత ఘాటుగా ఈ సారి కేంద్రాన్ని విమ ర్శించలేదు. మద్రాసు నగర షెరీఫ్ బాలకృష్ణన్ అధ్యక్షత వహించారు. యూత్‌లైన్ (Youth Line) అధ్య క్షులు: డా॥ పిజె అలెగ్జాండర్; ఉపా ధ్యక్షులు : జి యస్ ఆదిశేషన్. ప్రధాన కార్యదర్శి : హర్‌భజన్‌సింగ్ ....నవయువతలో సద్భావనా, సామాజిక చైతన్యం కలగజేయడం ఈ 'యూత్‌లైన్' లక్ష్యం. విద్యా వంతులైన యువతీ యువకులు ఈ సంస్థకు సారథ్యం వహిస్తున్నారు.

..... 04

'అమ్మతోడు లేకున్నా నాన్నతోడు లేకున్నా, నీకు నాకు ఉన్నతోడు కన్నీళ్లే నమ్మా' (గాత్రం: బాలు; గీతం: దాసరి) అంటూ వెంకటేష్, బేబీషాలిని పై చిత్రీకరించిన పాట, గుండెలు పిండే కరుణరస వాహిని 'సన్నజాజి చెట్టు కింద సలవ సలవ - చిన్నమ్మ కెందు కింత గొడవ' (గాత్రం: బాలు, సుశీల; గీతం: వేటూరి) వెంకటేష్ రజనీలపై కాశ్మీరులో చిత్రీకరించిన ప్రణయ గానం - ఈ ఉదయం 'ఏ వి యమ్'లో 'బ్రహ్మ పుత్రుడు' (సురేష్ ప్రొడక్షన్స్) చిత్రంలోని అయిదు పాటల ప్రదర్శన అయాక, ఈ పిక్చర్ తను ఆశించిన

రీతిలో రూపొందిందని అన్నారు పాత్రికేయులతో దర్శకులు దాసరి నారాయణరావు. డైలాగ్ డెలివరిలో వెంకటేష్ బాగా యింప్రూవ్ అయాడనీ, యిది అతని తొమ్మిదవ చిత్రమనీ అన్నారు నిర్మాత రామానాయుడు.... వెంకటేష్, మోహన్‌బాబు, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, నాగేష్, మాడా, జయసుధ, రజని, విజయ, రాధాకుమారి, బేబిషాలిని మున్నగు వారున్నారు. చక్రవర్తి సంగీతం.... మీరిది చదివే నాటికి పిక్చర్ రిలీజై ఉంటుంది . పి ఆర్ ఒ; శ్రీనివాస్.... పామ్ గ్రోవ్ లాన్స్‌లో 'లియొ ఆడియొ-విడియో' వారి రెండు సరికొత్త కాసెట్ల రిలీజ్ ఫంక్షన్. ఎగిక్యూటివ్ డైరక్టర్ ఆనంద్, ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట, ఎ ఎ కె రంగారావు వెనకటి సినిమా మ్యూజిక్ గురించి ప్రస్తావించారు. హైదరాబాదు నుంచి వచ్చిన ఆచార్య 'పాండవ వనవాసం' ఫార్సుతో సభికులని నవ్వించారు. పల్లవీ బృందం పాడిన 'చిన్నారిగీతాలు' కాసెట్‌ని డైరక్టర్ రాఘవేంద్రరావు విడుదల చేయగా, 'యువచిత్రా' వారి 'జానకి రాముడు' పిక్చరులోని పాటల కాసెట్‌ని నిర్మాత దేవి వరప్రసాదరావు రిలీజ్ చేశారు. పాత్రికేయులకు రెండు కాసెట్లూ సమీక్ష నిమిత్తం యిచ్చారు.... పి ఆర్ ఒ: అర్జునరావు

.... 05

సురేష్ మూవీస్ సమర్పించిన ఉషా ఆర్ట్స్‌వారి 'రక్తతిలకం' నూటయాభై రోజుల పండుగ టాజ్ కోరమాండల్



శర్మాదంపతులు స్థాపించిన చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు, భారత రాష్ట్రపతి అధ్యక్షతను, ఈ మధ్యనే స్వర్ణోత్సవం జరుపుకుంది.... యశస్వి రీరులు ఎల్లెన్ శర్మ

లో ! గోపాల్ దర్శకత్వం వహించగా అశోక్‌కుమార్ నిర్మించిన ఈ చిత్రంలో ప్రముఖ తారాగణమంతా ఉంది. వెంకటేష్ కథానాయకుడు. ఉపన్యాసాలు లేని ఈనాటి సభను యమ్మెస్ రెడ్డి నిర్వహించారు. సినీ రంగంలో ప్రముఖులైన డివియస్ రాజు, పుండరీకాక్షయ్య, రామానాయుడు, మురళీ మోహన్, నాగార్జున మున్నగు వారు ఆ యా కళాకారులకు, సాంకేతిక నిపుణులకు, పంపిణీ దారులకు, ప్రదర్శకులకు షీల్డులు అందజేశారు. పరస్పర పలకరింపులూ కమ్మటి కబుర్లూ తో డిన్నర్.... 'హల్లో అంకుల్' అంటూ వచ్చింది యజ్ఞప్రభ (షావుకార్ జానకి

కూతురు); ముమ్మూర్తులా తల్లిపోలికే. 'ఇరవై మూడేళ్లు గుజరాత్‌లో వుండి యిక్కడి కొచ్చేశాం.... మమ్మీ స్టేట్స్ వెళ్లింది - తెలుసుగా! జులై లో వస్తుంది.... వైష్ణవి - మా అమ్మాయి.... రెండు పిక్చర్స్‌లో బుక్ అయింది.... మాలతీ ఆంటీని అడిగాననిచెప్పండి - నేనూ, మా అయనావస్తాం మీయింటికి' - అంది యజ్ఞప్రభ.... షావుకారు జానకి, 'పట్నవాసం' జానకి (రేడియో రూపకం) కాలం నుంచీ మాకు సన్నిహితురాలు.

..... 11

హొటల్ చోళాకీ,సత్యమ్ థియేటర్ కీ మధ్యగా గోపాలపురం లాయడ్స్ రోడ్‌లో (233) 'గీతాభవన్' అనే రెండతస్తుల భవంతి, సామాజిక సాంస్కృతిక కార్యక్రమాలు ప్రోత్సహించే నిమిత్తం, ముప్ఫయి నలభై లక్షల వ్యయంతో రూపొందుతోంది. భగవద్గీత అన్ని మతాలకూ చెందిన వివేక విజ్ఞాన దీపిక. గీతా ప్రవచనం మనిషికి శాంతినీ మనసుకి చైతన్యాన్ని యిస్తుంది.... గత పదేళ్లుగా చెల్లస్వామీ దంపతులు (లక్ష్మి) శ్రీనివాస గీతాసత్సంఘంగా కృషి చేస్తున్నారు.... గీతా భవన్ ట్రస్ట్‌కి పురుషోత్తమ గోస్వామి ఛైయిర్ మాన్; ఇందర్‌సేన్ గోయల్ ప్రెసిడెంట్. హరిగోపాల్ అగర్వాల్, అశోక్ గోయల్ మేనేజింగ్ ట్రస్టీలు. ఈ సంస్థలో ఇరవై అయిదుగురు ప్రముఖులు సభ్యులు గా ఉన్నారు. నూతన భవన ప్రారంభోత్సవ సందర్భంగా ఉదయం పదకొండు గంటల ప్రెస్ మీట్ ఏర్పాటు చేశారు. ప్రఖ్యాత జర్నలిస్ట్ డి. ఆంజనేయులు ఈ భవనంలో నిర్వహించే సంస్కృత తరగతులు, సెమినార్లు మిగతా వాటి గురించి వివరించారు.

..... 12

'జెయస్‌కె' వారి 'కాంచనసీత' నూరు రోజుల పండగ టాజ్‌లో, సరిగ్గా సాయంత్రం ఏడున్నరకి ప్రారంభమయింది. ఉపన్యాసాలూ పొగడ్తలూ యిలాటివేమీ లేవు. ముఖ్య అతిథులుగా విచ్చేసిన కమలహాసన్, బాలకృష్ణ, రాఘవేంద్రరావు, రాజేంద్రప్రసాద్ మున్నగు వారు పిక్చర్‌లో పాల్గొన్న నటీనటులకు, సాంకేతిక నిపుణులకు, పంపిణీ దారులకు, ప్రదర్శకులకు జ్ఞాపికలు అందజేశారు. కార్యక్రమం మురళీమోహన్ నిర్వహించగా, వేదిక మీదబాధ్యత నిర్మాత నితిన్‌కపూర్‌ది. ఒక చిన్న చిత్రం, ఒక చిన్న విజయం, ఒకచిన్న ఫంక్షన్ - అన్నారు దర్శకులు దాసరి నారాయణ రావు వందన సమర్పణగా.... పాలమీగడ వంటి షెల్వార్ కమీజ్‌లో జయసుధ, అన్నిటా తానై తిరుగుతూ, తెలిసిన అందరినీ చిరునవ్వుతో పలకరించారు - ఒకవంక ఆటోగ్రాఫ్ హంటర్స్‌ని నిరుత్సాహ పరచకుండా! అనుకోని క్రవుడ్ వచ్చినప్పటికీ నితిన్ దంపతులు నేర్పుగా మానేజ్ చేయ గలిగారు.... 'ఉత్తర రామ చరిత్రను సోషలైజ్ చేసిన ఈ చిత్రంలో జయసుధ ప్రేక్షకులని కరుణ రసావర్ణంతో ముంచుతుంది' ('అని వ్రాశాము') 'కాంచనసీత

సమీక్షిస్తూ ('జగతి' - 382). ఆ కరుణ రస పోషణను తెలుగు ప్రేక్షకులు మెచ్చు కున్నార నేందుకు నిదర్శనమే ఈ నాటి వేడుక.... పి ఆర్ ఒ: జగన్.

## 15

జూన్ పదహారు జానకి రామ్‌గారి జన్మదినం. రేపు వుదయం నుంచీ ఏవేవో పనులు వుండటం వల్ల తెములుతుందో లేదోనని గ్రీట్ చేయడానికి యివ్వాళే వెళ్లాను. మా మద్రాసు జీవితంలో '8 - బిసెంట్ రోడ్' మాకు సెకండ్ హోమ్ లాటిది. చెట్టునీడని మెట్లమీద ఎన్ని సాయింత్రాలు ఛెస్ ఆడామో! అప్పట్లో కాలం తాపీగా నడచేది - వురుకులూ పరుగులూ లేవు. వేడివేడి ఉప్మా కాఫీలు మామీ అందించగా, అప్పుడప్పుడు పల్కరించి వెళ్తూండేవారు శారదగారు.... టీన్స్‌లో ఉన్నప్పుడు ఏదో స్పెషల్ ఇష్యులో చదివాను - జానకిరామ్‌గారి 'మీరు నవ్వరేమి!'.... మనో మందిరాన కర్పూర దీపం వెలిగించి, స్నేహానికి పట్టం గట్టిన ఆ రసహృదయుని చూడా లనిపించింది. నాలుగైదేళ్ల పోయాక శ్రీశ్రీ తీసుకువెళ్లారు నన్ను వారింటికి – అంటే ఈ ఎనిమిది బిసెంట్‌రోడ్‌కి! అప్పటికే 'శేషతో

షికారు' 'సీతతో సినిమాకు' వంటి నాటికలు నేను రాసినవి, మద్రాసు రేడియో కేంద్రం నుంచి ప్రసారమయాయి. అన్నీ ప్రశ్నార్థకాలుగా కనిపించే చిన్నపిల్ల శేషు, ఆమెని ఊరుకో బెట్టగల సమాధానాలు చెప్పే అంకుల్ - ఆ రూపకాల్లోని ప్రధాన పాత్రలు. శ్రీశ్రీ నన్ను ఫలానా అని పరిచయం చేయగానే 'మీ శేషు ఎలా ఉంది?' అని ప్రశ్నించారు జానకి రామ్. ఆ ప్రశ్నలోనే నాకు కొండంత బలాన్ని యిచ్చే శక్తి నిగూఢమైవుంది. నేను పంపిన రచనలను పరిశీలించి, బ్రాడ్‌కాస్ట్ చేయించినదీ ఆయనేనని ఆ క్షణం దాకా నాకు తెలీదు - శేషూ అంకులూ ముఖ్యులుగా ఏడెనిమిది నాటికలు అప్పటికే ప్రసారమయాయి. సృజనలోని శేషుకు వయసు రాదు – కాలంతో పెరగదు. కాని, నాలోని కథకుడు రాధనీ, మాధవినీ చూస్తున్నాడు.... ఉదయం పదిగంటల వేళ ఆ యిల్లూ, ఆ సంపదా, ఆ సౌకర్యాలు చూసి 'జానకిరామ్‌గారు అదృష్టవంతులు' అనుకున్నాను. ఇప్పుడూ అదే మాట అంటాను. స్మృతి పథంలో సాగుతున్న యాత్రను ఆంధ్ర పాఠకులకు సమర్పించి, స్నేహ సౌందర్య దీప్తులతో సారస్వతానికీ చిత్రకళకీ అంకితమైన జానకిరామ్‌గారు నిజంగా అదృష్టవంతులు. (అచంట లక్ష్మీపతి గారి కుమారుడు ; ప్రపంచ ప్రఖ్యాత న్యూరో సర్జన్ రామ్మూర్తి గారి బావమరిది). తన ఆరోప్రాణంలా చూసుకుంటున్న శారదాదేవి గురించి చెప్పడం బావుండదు.... "రేపు మధ్యాహ్నం మ్యూజిక్ అకాడమీ ఫంక్షన్‌కి, - ఆలిండియా రేడియో గోల్డెన్ జూబిలీకి మీరిద్దరూ వస్తున్నారు కదా?" - అని అడిగాను శారదగారిని ... "మాకు ఇన్విటేషన్ రానిదే ...." అన్నారామె. 1938 జూన్ 16వ తేదిన, మద్రాసు రేడియో కేంద్రం ప్రారంభమైన రోజున ఉద్యోగంలో చేరిన అచంట జానకిరామ్‌గారికి ఇన్విటేషన్ రాకపోవడమా? ఏదో ఎక్కడో పొరబాటు జరిగి వుంటుంది. "ఇన్విటేషన్ వచ్చినా ఆయన రారనుకోండి" - అన్నారామె. "రావడం, రాకపోవడం అది మీయిష్టం - ఇన్విటేషన్ పంపివుండాలి కదా!" - అన్నాను. ... పదకొండున్నరకి యింటికి వస్తున్నప్పుడు ఆలిండియా రేడియో వద్ద ఆగి, మిత్రులు గోపాలకృష్ణ తన రూమ్‌లో లేకపోవడం వల్ల, స్టేషన్ డైరక్టర్ శెల్వాన్ని కలుసుకు ఈ విషయం చెప్పగా, 'అయ్యో, ఎలా జరిగింది' అని ఆయన ఎంతో నొచ్చుకున్నారు. వెంటనే మెస్సెంజర్ ద్వారా ఇన్విటేషన్ జానకిరామ్‌గారికి పంపించారని తరువాత తెలిసింది.

. . . . . 16

"ఏడవ పంచవర్ష ప్రణాళికలో ఏడువందలకోట్లు రేడియో ప్రసారాభివృద్ధికోసం కేటాయించారు. ఆలిండియా రేడియో ప్రస్తుతం 93 శాతం ప్రజలకు అందుబాటులో ఉంది. .... రేడియోకీ, టెలివిజన్‌కీ పోటీ ఎంత మాత్రమూ లేదు ; దేనిదోవ దానిదే!

అలాగే సినిమాకి, రేడియోకి, పత్రికా ప్రపంచానికీ, నాటక రంగానికీ, దూరదర్శినికీ, ఏదో పరస్పరవైరుధ్యం వుందనీ, ఒక దానితో మరొకటి పోటీ పడుతున్నాయనీ అనుకోవడం సమంజసమూ కాదు, సహేతుకమూకాదు. ఎవరి కార్యక్షేత్రం వారిది. ఆలిండియా రేడియో ప్రస్తుతం రోజుకి 1700 గంటల ప్రసారాలనందజేస్తోంది.... భారత దేశంలోని మొట్టమొదటి బ్రాడ్ కాస్టింగ్ ఈ మద్రాసు నగరంలోనే 1924లో ప్రారంభమయింది. పత్రికా స్వాతంత్ర్యాన్ని అభిప్రాయ స్వాతంత్ర్యాన్ని పరిక్షించే బాధ్యతను ప్రభుత్వం ఏనాడూ విస్మరించదు" - అన్నారు ఆలిండియా రేడియోవారి స్వర్ణోత్సవ సంచికను విడుదలచేస్తూ కేంద్ర సమాచార మంత్రి హెచ్ కె యల్ భగత్. మ్యూజిక్ అకాడమీలో జరిగిన ఈ స్వర్ణోత్సవ వేడుకకు అధ్యక్షత వహించిన తమిళనాడు గవర్నరు పి సి అలెగ్జాండర్, 1938లో ఈ కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపిన రాజాజీ పలుకులు గుర్తు చేశారు. 'ఆకాశాన్ని జయించిన ఈ వైజ్ఞాని అవకాశం మీకు నా పలుకులని వినిపింపజేస్తోంది. ప్రజలకు సంతోషమూ, వివేకమూ, అందీయగల మహదవకాశమిది' అన్నారు ఆనాడు రాజాజీ. ఆ మొదటిరోజున పాడిన శెమ్మంగుడి శ్రీనివాసయ్యర్ యివ్వాళ కచ్చేరీ చేశారు.... సభా ప్రారంభాన, ఆలిండియా రేడియో డెరకర్ జనరల్ ఎఆర్ షిండె ఆహూతులకు స్వాగతం తెలిపారు. కన్స్యూమర్ ప్రొటెక్షన్ (వినియోగదారుల రక్షణ) విషయంలో రేడియో చేయగలిగింది ఎంతైనా ఉన్నదనీ, మద్రాసు టివి రెండవఛానెల్ జులైలో ప్రారంభం కానున్నదనీ, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, ఒరిస్సాలకి మాదిరి తమిళనాడుకికూడా సాటిలైట్ లింక్ తొందరలోనే ఏర్పరుస్తామనీ అన్నారు భగత్. మద్రాసు స్టేషన్ డైరక్టర్ (ఆలిండియా రేడియో) సెల్వమ్ వందన సమర్పణ గావించారు.... మద్రాసు రేడియో కేంద్రానికి ఏభైఏళ్ళు నిండాయి - మాకు రేడియోలో ఇంచు మించు నలభై ఏళ్ల అనుబంధం. ఒకటా రెండా - ఎన్నో ఎన్నెన్నో జ్ఞాపకాలు.... పూర్తిగా ఒక నెల్లాళ్ళు కూడా వుండ కుండా పదిహేను పదహారు రోజులయాక 'నన్ను రిలీవ్ చేయండి' అని అడిగినప్పుడు, యస్సెన్ మూర్తిగారు 'ఎందుకు చేజేతులా వొదులుకుంటున్నారు? ఏమైనా ప్రాబ్లెమ్సా?' అని సాయిలా పాయిలాగా అభిమానం కురిపిస్తూ అడిగారు. 'ప్రాబ్లెమ్స్ ఏమీ లేవు – నేను ఇందులో యిమడలేనేమోనని అనిపిస్తోంది,' – అన్నాను. ఆయన నా వంక ఎంతో దయగా చూస్తూ, 'ఇవ్వాళ శనివారం కదా – సోమవారం నాటికి కూడా మీ మనసు సమాధానపడకపోతే రిలీవ్ చేస్తాను' - అన్నారు. మనసు సమాధానపడలేదు - 'విష్ యు గుడ్‌లక్' అని చెప్పిన మూర్తిగారి దీవెనతో

బయటికొచ్చాను; ఆ రాత్రే మెయిల్ ఎక్కాను ఏలూరుకి.... జాబైతే వొద్ద న్నాను గాని చాలా ప్రోగ్రామ్స్ లో పాల్గొనేవాణ్ణి అప్పట్లో తెలుగు బుక్ రెవ్యూలు నేనూ ప్రొన్సిస్సూ చేసినన్ని మరింకెవరూ చేయలేదోమో కూడా ! 'సినిమా రెవ్యూ' అనేది రేడియో కార్యక్రమాలలో నిలిపివేసే దాకా ప్రతీ వారం నాలుగు మూడు సినిమాలు సమీక్షిస్తూండేవాణ్ణి. ఆ రోజుల్లోనే మాలతి 'మహిళా మండలి' ద్వారా శ్రోతలకు, 'ఆనందవాణి', 'భారతి' ద్వారా పాఠకులకు పరిచయమయింది. .... అయిదారేళ్ల తర్వాత, బొంబాయి నుంచి మద్రాసుకి స్టేషన్ డైరక్టర్‌గా వచ్చిన యస్సెన్ మూర్తిగారిని, సెంట్రల్ బాంక్ డియస్ శాస్త్రి గారింట్లో కలుసుకోవడం జరిగింది. ఆ చిన్న గాదరింగ్‌లో ఒక కాషాయాంబరధారి వున్నారు. "రేపు పొద్దుట పదకొండు గంటలకి స్వామీ ప్రణవానందని మీరు రేడియోకి ఇంటర్‌వ్యూ చేస్తున్నారు - రాత్రి ఈ పుస్తకం చదవండి" - అని మూడువందల పేజీల 'మౌంట్ కైలాఫ్' ఇచ్చారు. మూర్తిగారు - స్వామీ ప్రణవానంద ఇంగ్లీషులో రాసిన యాత్ర గ్రంథమది. ఆయన రాయల్ జాగ్రఫిక్ సొసైటీ మెంబర్ ఆంధ్రాయునివర్సిటిలో విజిటింగ్ ప్రొఫెసర్ - పూర్వాశ్రమంలో ఆయన పేరు కనకదండి సూర్యనారాయణ. మా తండ్రిగారు తనకు తెలుసుననీ, ఏలూరులో మా యింటికి ఒకసారి వచ్చాననీ ఆయన అనే సరికి నాకు మరింత సంతోషం కలిగింది.... పుస్తకం ముగించేప్పటికి ఆ రాత్రి మూడున్నర అయింది.తొమ్మిదింటికి లేచి, స్నానం, ఇడ్లీ అయాక, పదిన్నరకి మార్షల్స్‌లోని రేడియో స్టేషను కొచ్చి, అడగవలసిన ప్రశ్నలు తయారు చేసుకున్నాను..... మానస సరోవరం చుట్టూ ఎనిమిది బౌద్ధారామాట ఉన్నాయి. ఆ సరోవరంలోని మంచు కరుగుతున్నప్పుడు ఓంకారం నుంచి ఘీంకారం హూంకారాలదాకా, ఈ సృష్టిలోని సమస్త ప్రాణికోటి నోట పలికే శబ్దాలన్నీ వినిపిస్తాయట. పర్వతారోహణలో దేహస్థితిలోని రసాయనక మార్పు మనః ప్రవృత్తిని ఎలా మార్చేదీ చెప్పారు. నేను ప్రశ్నలు, వేయడము వారు చెప్పడము గనక ఇంటర్‌వ్యూ ఎంతో చక్కగా వచ్చింది "ప్రవరాఖ్యునిలాప్రశ్నలుఅడిగారే !" అని యస్సెన్ మూర్తిగారు నా వీపు తట్టి, నన్ను కాంప్లిమెంట్ చేయడం ఎంతో ఆత్మబలాన్ని యిచ్చింది.... సమాచార మంత్రిత్వశాఖలో డైరక్టర్ జనరల్‌గా రిటైరై యింకో నాలుగు మూడు నెలలకు పోతారనగా,ఎదో పని మీద మద్రాసు వచ్చి, ఒక పూటంతా మాతో గడిపారు - యిక్కడే భోం చేశారు, ఎన్నో విశేషాలు చెప్పారు.... స్వామీ ప్రణవానంద ఇంటర్‌వ్యూ ఏభైల నాటిది.... విజయవాడ కేంద్రం ప్రారంభమయాక అక్కడికిట్రాన్స్‌ఫరు వుతున్న బుచ్చిబాబు, 'క్లియోపాత్రా' షెడ్యూలు చేయమని రజనికి చెప్పి మరీ వెళారట - ఆ మాట రజనీ

